# తెరలో తెర



రచయిత

కొర్రపాటి గంగాధరరావు

# తెరలో తెర

(సాంఘిక నాటకం)

రచన

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు

బాపట్ల (గుంటూరు జిల్లా)

పబ్లిషర్స్

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# పాత్రలు

సుధాకర్రం—ఒక నాటక రచయిత, సుందరరామయ్యగారి కుటుంబ స్నేహితుడు.

సుందరరామయ్య—ఒక సంపన్న గృహస్థుడు. 55 ఏళ్లు.

మూర్తి....సుందరరామయ్యగారి కొడుకు. 22 ఏళ్లు.

రఘు—మూర్తి లలితలకు స్నేహితుడు. 22 ఏళ్ళు.

డాక్టరు—సుందరరామయ్యగారి కుటుంబ వైద్యుడు. 24 ఏళ్ళు.

సుఖదేవ్—17 ఏళ్ల పిల్లవాడు.

డ్రైవర్—

లలిత—సుందరరామయ్యగారి కూతురు. 19 ఏళ్ళు.

ఈ నాటకం ప్రథమ పర్యాయం కళావని బాపట్లవారిచే ప్రదర్శింపబడింది.

వారి నటవర్గం :—

గంగాధరరావు, సింగరాజు నాగభూషణం, N. N. ప్రసాద్, Dr. S. V. చలపతిరావు, N. K. శర్మ, D. V. కృష్ణమూర్తి, సరోజిని.

# తెరలో తెర

"మనసులో తెరలో తెరలు లేకుండా ఉన్నదున్నట్లుగా మనసా, వాచా ప్రవర్తిస్తే ఏ యిబ్బందులూ రావు" అనేది ఈ నాటకంలోని కథా వస్తువు. కథ అంతా సుందర్రామయ్యగారి కుటుంబంలోని వ్యక్తులకు సంబంధించింది. కుటుంబంలోని వ్యక్తులందరూ పూర్తిగా వాళ్లవాళ్ల అభిలాషలు బైటపెట్టకుండా స్వప్రయోజనాన్ని సాధిద్దామని ప్రయత్నిస్తారు. వాళ్లవాళ్ల అభిలాషలు పూర్తిగా బైటపెట్టిఉంటే తేలిగ్గా సాధించగల్గిన విజయంకొసం 'సుధాకరం' నానా తంటాలు పడవల్సివస్తుంది. ఇది అవటానికి సుందర్రామయ్యగారి కుటుంబ వ్యక్తుల కథ అయినా, సుధాకరం ఆడిన నాటకంగా అనిపిస్తుంది. అందువల్ల సుధాకరం ఏదో విపరీతమైన ఆశావాదిగా కన్పిస్తాడు. సుధాకరం "మానవుడు తన కష్టనిష్ఠురాలను తనే కల్పించుకున్నాడని, కొంచెం చాకచక్యంతో ప్రవర్తిస్తే తనే వాటిని తనకు సుఖప్రదంగా త్రిప్పుకోగలడనీ అలా త్రిప్పుకొని తన జీవితాన్ని చక్కగా నడుపుకొవాల"నీ అంటాడు. అలాగే పూర్తిగా విషయాలన్నీ అవగాహన చేసుకున్న తర్వాత నాటకాంతంలో వెనక్కి తిరిగి చూసుకొన్న తర్వాత తీర్చవల్సిన సమస్య కన్పించకుండా పోతుంది. అంతవరకూ కొరకరాని కొయ్యగా కన్పించిన సమస్య అన్ని పాత్రలకూ అనుకూలంగా మారిపోతుంది. ఏదో అద్భుతంగా నాటకం మారిపోతుందని ఆశించిన ప్రేక్షకులకు కొంత ఆశాభంగం కల్గుతుందేమో! కాని అన్ని సంగతులూ పూర్తిగా అర్థం చేసుకున్న తర్వాత ఏ క్లిష్టసమస్య అయినా మంచులాగానే విడిపోతుందిగదా!

సుధాకరం నాటక రచయితగా మరొక్కమాట కూడా అంటాడు. జగన్నాటకంలో పాత్రల నర్థం చేసుకుని సన్నివేశాన్ని కూర్చి వదలిపెడితే కథ ముందర అనుకోకుండానే పాత్రలే నాటకాన్ని పూర్తిగా ఆడేస్తాయి. మానవప్రకృతిని పూర్తిగా అర్థం చేసుకోవటం కష్టసాధ్యం; మానవప్రకృతి నర్థం చేసుకోవాలంటే అ మానవుణ్ణి చిన్నచిన్న సన్నివేశాల్లోనూ, అనవసరపు ప్రసంగాల్లోనూ బాగా కనిపెట్టి ఉండాలి. ఇదంతా చేసి సుధాకరం చివరి నాటకం ఆడగలిగాడు. సన్నివేశాన్ని కూర్చి వదలిన తర్వాత సుధాకరం ఏమి మాట్లాడనక్కరలేకుండా నాటకం నడిచింది. డాక్టరుగా రచయితగా నాకూ ఈ కథకూ సంబంధం లేదు. సంబంధం లేకపోయినా మానవలోకం సంబంధం కల్పించుతుంది గనక చెప్పుకోవల్సివస్తూంది. నాబాబు నాటకంలో సర్వయ్య మాటలు, నేను బోధిస్తున్న వేదాంతంగా విమర్శించారు - విమర్శకులు; తక్కన విమర్శంతా ఎంత ఘోరంగా వున్నా యీ వాక్యం మాత్రం చాలా బాధ కల్గించింది.

ఇది తేలిగ్గా ప్రదర్శించటానికి ఒక చక్కని నాటకం. అనేకసార్లు రక్తివంతంగా ప్రదర్శింపబడింది. —గంగాధరరావు.

# తెర లో తెర

## మొదటి రంగము

[ఒక సంపన్న గృహస్థుడి ఇంటిలో మధ్యసావిడి. రంగం మధ్యలో ఒక చిన్న టేబుల్. దాని చుట్టూ అయిదు కుర్చీలువేసి ఉంటాయి. తెర లేచేసరికి అందరూ కాఫీలు త్రాగుతూ ఉంటారు. మధ్యన ఉన్నది ఏభై యేళ్ళ వృద్ధుడు. పేరు సుందర్రామయ్య. అతని ప్రక్కగా పదిహేడేండ్ల కూతురు లలిత, ప్రక్కగా స్నేహితుడు రఘు. ఇరవై రెండేళ్ళు. వృద్ధునికి మరొకప్రక్క కొడుకు - మూర్తి. ఇరవై రెండేళ్ళు, ఉన్నారు. అందరూ కాఫీగ్లాసులు చేతపట్టుకొని ఏదో ఉపన్యసిస్తున్న వాని వంక చూస్తున్నారు. ఆయనపేరు సుధాకరం, ముప్పదిఅయిదు సంవత్సరముల వయస్సు]

సుధా—ప్రపంచమంతా నాటకరంగం
స్త్రీలు, పురుషులూ పాత్రధారులు
ఎంతో చక్కని అంకాలు
అంకాలల్లో రంగాలు
రంగరంగముల రక్తినిగట్టె రకరకాల కథలుపకథలు
ఒకదో నొకత తెర జారిపోవగా -
నొకదో నొకత తెర పైకి లేవగా -
నాటిక సమచును - సమము నాగకా.

విషాద మొకచో - వినోద మొకచో -
విషాదాన కాల వినోదమొకచో -
వివిధాకృతులతో సన్నివేశముల
విధించి నడిపే విధాత ఎవడో!...(ఆగి)

ఎవడో!......ఎక్కడున్నాడో! కాని - వాడెవడైనా - మానవుడే అయివుంటాడు. (చుట్టూ చూసి) ఏం? మీరంతా వింటున్నారా లేదా?

లలిత } రఘు }——వింటున్నాం; వింటున్నాం;

సుధా——వింటున్నారా!

మూర్తి——ఆ.

(సుందర్రామయ్య నవ్వి ఊరుకుంటాడు.)

సుధా——వింటున్నారా? వింటుంటే - ఒక్కసారైనా చప్పట్లు కొట్టరేం?

లలి——చప్పట్లుకొట్టే వాళ్ళమే గాని మీరు పూర్తి చేశారో- లేదో - తెలియక - మీరు అంటున్నది కూడా అర్థం కాక - మానేశాం.

సుధా——అర్థం కాలే!! చాలా చిన్న విషయమే. ఈ ప్రపంచంలో వున్న కష్టాలూ సుఖాలూ, దైవ నిర్ణీతా లనుకోవడం తప్పు. కష్టమనేదీ - సుఖమనేదీ ఎక్కడో విడి విడిగా లేవు. అంతా మనసులో మనం అనుకోటంలో ఉంటుంది,

రఘు—అవును; ఒకడికి కష్టమైందే. ఇంకొకడికి సుఖం కావచ్చుగా!

సుధా—అంతే కాదు! నువ్వు మామూలుగా 'కష్టం' అని యివ్వాళ అనుకున్నది, రేపు నీకు సుఖం కావచ్చు.

రఘు—అదెట్లా ?

సుధా—తండ్రి మరణం సాధారణంగా అందరికీ దుఃఖకారణం. కాని భావి జీవితంలో, అదే కుమారునికి సుఖకారణ మవ్వొచ్చు.

లలి—ఇది కాస్త గమ్మత్తుగానే వుంది!

సుధా—ఉంటుంది. కాని ఒక కష్టం దానంతటది మారటం–మనం చూస్తూ వూరుకోవటం కాదు; మనమే ఆకష్టాన్ని సుఖంగా మార్చుకోగలగాలి.

మూర్తి—అంతకంటే అసాధ్యం లేదు!

సుధా—అంతా సాధ్యమే; ఉదాహరణకి – మనం ఒక మరణ శయ్యను హాస్యభరితం చెయ్యోచ్చు.

మూర్తి—మీరు నాటక కర్తలు; నాటకాల్లో మీరేమైనా చేస్తారు.

లలి—ఆ...మరే, నాటకంలో పాత్రలు మీరు చెప్పినట్లు నడుస్తాయి గనక...

సుధా—కాని – నే చెప్పే విషయం నాటకం విషయంకాదు. ఈ జగన్నాటక విషయమే. జీవితంలో అన్ని సన్నివేశాల్నీ మనం చేత్తో నడిపించుకోగలం,

రఘు—దాని మీాదేం నమ్మకం కుదరడం లేదు.

సుధా—అయితే చేసి చూపిస్తాను.

సుంద—(లేచి) చేసే చూపిస్తే బాగుంటుంది. మీాకు తీరు బడి అయినప్పుడు. కాని నేను ఈ ఏభై ఏళ్ళ జీవితాన్నీ నాటకంలాగా చూట్టంలేదు. ఈ జగన్నాటకంలో నే నొక పాత్రధారిననీ అనుకోవటంలేదు. 'వేదాంతంలో జీవితాంతం' అని కూడా నేననుకోను. జీవితం ఒక నిర్మాణం వంటిదని నా మనవి. జీవితాన్ని మనమే కష్టపడి నిర్మించుకోవాలి.

సుధా—ఒక విధంగా నా అభిప్రాయం కూడా అదే.

సుంద—అయితే దీన్నొక నాటకం చేయకండి.

సుధా—నాటకం ఎవ్వరూ చేసికోవద్దు. కాని జీవితంలో అన్ని సన్నివేశాల్నీ మన కనుకూలంగా మార్చుకుంటే, జీవితం దానంతట అదే - మన ఇష్ట ప్రకారం తయారై కూర్చుంటుందంటాను.

సుంద—ఇదంతా బాగా నేవుంది - మాట్లాడుకోవటానికి. అదల్లా వుంచండి. నాటక రచయితగా మీారూ, వృద్ధాప్యంవల్ల నేనూ, కాలం వృథాచేయడంకంటే మరేం చేయలేం. కాని చూశారూ - ఈ యువకులకాలం చాలా అమూల్యమైనది! మూర్తీ! నువ్వా ఎకౌంట్ పుస్తకాలు సరిచూశలేదు. సరిచూస్తూ పో.

మూర్తి—(లేచి వెళ్తూ) మర్చిపొయ్యాను. ఆ! వస్తానండీ సుధాకరంగారూ! (వెళతాడు)

సుంద—లలితా! ఆ...వంటకెంత ఆలస్యం వుందో చూసిరా.

లలి—(లేచి వెళ్ళబోయి ఆగి) ఆ–; ఉంటావా – రఘూ! వెళ్తావా?

రఘు—ఎక్కడికెళ్తాను!......నీ వెంట వస్తున్నా.

(రఘు లలిత వెళతారు)

సుంద—క్షమించండి; మీరేదో చాలా చెబుదా మనుకున్నట్లున్నారు. మధ్యలోనే వాళ్ళను పంపేశాను. కాని నేను వాళ్ళను పంపెయ్యాలనే పంపాను.

సుధా—అది నేనూ గ్రహించాను. సాధారణంగా నేను నాటక రచనలో చేసే పనే అది.

సుంద—మీరనేది ఒక సన్నివేశాన్ని మనం – మన కనుకూలంగా మార్చుకోగలమని.

సుధా—అవును.

సుంద—కవులు గనుక మీకది కష్టం కాదేమో. సామాన్యులం మేము, సన్నివేశం మార్చుకోవటం మాకు సాధ్య మంటారా?

సుధా—మీకు మనస్సులో ఏదో ఉంది. దానికి నన్ను మార్చాలని చూస్తున్నారు.

సుంద—నిజం గ్రహించారు. ఒకే సన్నివేశం మీకిస్తున్నాను...నాటకం సహాయపండి. నాకిప్పుడు పూర్తై యేళ్లు.

సుధా—దాన్ని నేనేం మార్చలేను.

సుంద—(నవ్వి) ఒక కొడుకూ, కూతురూ ఉన్నారు.

సుధా—అల్లుడు కూడానేమో!

సుంద—నవయువకులమల్లే, నాటక కర్తలుకూడా తొందర పడ్తే ఎట్లా.

సుధా—అహా! అయితే (నవ్వి) సామాన్యపు సన్నివేశంలా లేదే!

సుంద—ఇప్పుడిప్పుడే పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు.

సుధా—అవును. పెళ్ళిళ్ళు కాకపోయినా - చదువు లైపోయాయిగా -

సుంద—పెద్దవాళ్ళయిన తర్వాత వాళ్ళిద్దరూ నన్ను, మరీ ప్రేమగా చూస్తున్నారు.

సుధా—బుద్ధిమంతులు గాబట్టి -

సుంద—కాని పెద్దవాళ్ళవటమంటే నా ఉద్దేశ్యం "మనసులో వున్నదాన్ని మభ్యపెట్టి - పైకి మరేదో మాట్లాడటం" అని.

సుధా—ఆ!!!

సుంద—నా మీద ఇంత ప్రేమ కనపర్చటానికి ఏదో ఒక కారణం ఉండి ఉండాలి. వాళ్ళిద్దరి ప్రతి చర్యల్లోనూ చాలా మార్పు కనపడుతుంది.

సుధా—అహా!

సుంద——అబ్బాయ్ మధ్యాహ్నం ఒక్క రెండు గంటలు యింట్లో వుంటాడు. రోజంతా ఏంచేస్తాడో ఎవ్వరికీ తెలియదు. రాత్రి ఒంటిగంట అవుతుంది – ఇంటి కొచ్చే సరికి; ఆ ఇంట్లో వున్న రెండుగంటలూ – ఎక్కడ లేని ఆప్యాయతా కనబడుస్తాడు. ఇక అమ్మాయి – ఇదివర కెంత పెంకిగా ఉండేదో – అంత సాధువుగా మారి పోయింది.

సుధా——పెద్దపిల్లయిందిగా!

సుంద——నేనూ అంతే ననుకున్నా – మొదట్లో! కాని ప్రతి దాంట్లోనూ ఏదో తెచ్చిపెట్టుకొన్న కొత్తదనం కన్పి స్తుంది; ఎప్పుడూ ఆ రఘూతో గుసగుసలు; వాళ్ళల్లో వాళ్ళేదో ఘర్షణపడతారు; బ్రతిమాలుకుంటారు. నా అలి కిడి వినేసరికి మామూలుగా మారిపోతారు.

సుధా——మీరంతా పొంచి కనిపెడుతున్నారా – ఏం?

సుంద——కనిపెట్టాలని ప్రయత్నించాను – కుదరటంలా; ఈ నటనకు కారణం మీరు కనిపెట్టి చెప్పాలి. 'తెరలో తెరలు' చాలా ఉన్నట్టున్నాయి. తెర తొలగించి వెలుగు చూపించండి.

సుధా——(నవ్వి) అయితే – మీ కథలో నన్నొక పాత్రను చేస్తున్నారేమిటి?

సుంద——క్షమించాలి; మీ పాత్ర మీరు స్వీకరించక తప్పదు.

సుధా—నా పాత్రను నేను నిర్వహిస్తే - మీరు విచారించా ల్సిన విషయాలు బయటపడవచ్చేమో !

సుంద—కనబడని కల్మషం లేదనుకోవడంకంటే దాన్ని కనుక్కొని, కడిగివేసుకోవటం మంచిదిగా -

సుధా—అయితే - నన్ను సూత్రధారణ చెయ్యమంటారా ?

సుంద—ఆ - ఇప్పుడే అయితే మరీ మంచిది......మరి - మూర్తి వస్తున్నట్టున్నాడు నన్ను నిష్క్రమించ మంటారా ?

[సుందరరామయ్య - బయట ద్వారంగుండా వెళ్తాడు. మూర్తి మధ్య ద్వారంగుండా వస్తాడు].

సుధా—ప్రవేశించావా? రా!

మూర్తి—నాన్న ఎక్కడికి వెళ్తున్నారు?

సుధా—ఏమో! ఏం చెప్పలే ... ... (ఏదో చెప్పబోయి ఆగగా) ఆ! మూర్తీ...(ఏదో చెప్పబోయి - ఆగి)

మూర్తి—ఆ! ఏదో చెప్పబోయి ఆగారేం ?

సుధా—ఏం లేదులే! నువ్వింకా కుర్రాడివి......

(మూర్తి కోపంగా చూస్తాడు)

సుధా—ఏం! కుర్రాడివన్నానని కోపంవచ్చిందా!

మూర్తి—నువ్వింకా కుర్రాడివి. నువ్వూరుకో అన్న మాటను నాకెప్పుడూ కోపంరాదు.

సుధా—ఏం?

మూర్తి—రోజూ ఈ యింట్లో పడే మాటలే అవి?

సుధా—ఏమంటావ్?

మూర్తి— ఇరవైరెండేళ్ళు వచ్చినా ఇంకా కుఱ్ఱాణ్ణే; నాఆస్తి విషయం నాకు తెలియదు; నా పెళ్ళివిషయం నాకు తెలియదు. నా తిండివిషయం నాకు తెలియదు; నాగుడ్డలవిషయం నాకు తెలియదు; ఇక నాకేం తెలుసో - నాకే తెలియదు.

సుధా—నీలో...ఏదో...అగ్నిపర్వతం ఉన్నట్టుందే?

మూర్తి—అగ్నిపర్వతం ఏమిటండీ? కడుపుమండిపోతూంటే - ఏదికదిలించినా దానిసంగతి నీకు తెలియదులే అంటారు. నాకేం తెలియదు? ఈ ఇంట్లో నాస్థానం నాకు తెలియదా? నాచెల్లెలిసంగతి నాకు తెలియదా? ఆయనసంగతి తెలియదా? లోకాచారం తెలియదా? అతెలియనిదేదో - తెలియజెప్పరాదూ?

సుధా—ఊఁ,

మూర్తి—నాసంగతి సరే అట్లాఉంచండి; నాచెల్లెలిసంగతికేం? 'రఘూ' దాన్ని పెళ్ళాడటానికి సిద్ధంగావున్నాడు; వాడికి కాస్తో - కూస్తో - ఆస్తివుంది. దానిపెళ్ళి అయిపోయిందనిపించకూడదూ? కట్నంకూడా ఎక్కువ యివ్వనక్కర లేదుగా!

సుధా— అయితే - వాళ్ళపెళ్ళికి ఒప్పుకోడా మీనాన్న?

మూర్తి—ఇంకా ఏదో ఆలోచించాలిట!...ఆలోచన! దాని విషయం ఆలోచన తెమలదు. నావిషయంలో ఆలోచన అక్కర్లేదు.

సుధా—నీ బాధ - నా విషయం ఆలోచన తెమలదనా.
నీ విషయం ఆలోచన అక్కర లేకుండా పోతుందనా?

మూర్తి—దాని విషయం ఆలోచించటానికి ఏమీ లేదు; నా విషయం చాలా వుంది ఊని; అసలు ఆలోచనలు ఇంకా ఎందుకని? మీరు నాటకరచయితలు; సన్నివేశాన్ని అనుకూలంగా మార్చగలరు. కాస్త - నాన్నగారితో చెప్ప రాదూ?

సుధా—ఏం చెప్పమంటావ్ ?

మూర్తి—రేపు నా జీవితం సంగతి; నాకిచ్చే ఆస్థి సంగతీ; నా పెళ్ళి సంగతీ.

సుధా—వీటన్నిటికీ రాగల ప్రమాదమేమిటో - నాకర్థం కావటం లేదు.

మూర్తి—అర్థం చేసుకుంటానంటే చాలా చెప్తా! నాన్న ఆస్థంతా డెబ్బది వేలు చేస్తుంది. ఇరవై వేలు ఏమన్నా చేసుకోనీయండి. కనీసం యాభై వేలన్నా నాకు కావాలి.

సుధా—అంటే - ఆ ఇరవై వేలు లలితకు ఇవ్వవచ్చా?

మూర్తి—లలితకిచ్చినా సరే! - ఎవరికిచ్చినా సరే! నాజీవితానికీ, నా వివాహానికి యాభై వేల ఆస్తి వుండాలి.

సుధా—లేకపోతే పెళ్ళి కాదా?

మూర్తి—పెళ్ళవుతుందేమో, గాని నాకోరిక తీరదు.

సుధా—అంటే - కోరిన పెళ్ళి కాదా?

మూర్తి—కాదు.

సుధా—అయితే 'కోరినపెళ్ళి' ఒకటి వుందన్నమాట! ఊఁ - ఎవరేమిటి?

మూర్తి—శారద.

సుధా—శారదా......!

మూర్తి—ఆ! మీకెంత ఆశ్చర్యంగావున్నా నాకోరిక అది. నాకు తెలుసు-వాళ్ళకి ఆస్తికలవాళ్ళమని గర్వం వుందని కాని కొంచెం జాగ్రత్తగా వుంటే - నాకూ అంత ఆస్తీ వుంటుంది.

సుధా—ఊఁ! ఒక తెరలేచి విషయం కాస్త అవగాహన అవుతుంది. కనక మీనాన్నతో ఆస్తి పాడుచెయ్యొద్దని చెప్పమంటావ్!

మూర్తి—కొంచెం ఇంచుమించుగా అదే నేననేది; సన్నివేశంయిది. కనక - మళ్లీ నేచెప్పానని చెప్పక - ఆయన్ని కాస్తమార్చండి. ఇక నే వెళ్తా - రఘూ ఇటేవస్తున్నట్టున్నాడు.

సుధా—ఆ! సరే, నిష్క్రమించు. రఘూతోకూడా ఒకసారి మాట్లాడాలి.

మూర్తి—అల్లాగే. నేచెప్పింది మర్చిపోకండి; వస్తా.

(బయటికి వెళతాడు)

రఘు—(లోపల్నించి వస్తూ) నేవస్తానండీ సుధాకరంగారూ. మీరూవస్తారా? ఉంటారా!

సుధా—లలితతో మాట్లాడటం అయిందా?

రఘు—ఆ-ఏరో మామూలుకబుర్లే. ఇందాకణ్ణించీ వెళ్దాం - వెళ్దాం - అనుకుంటూనే ఆగిపోయాం.

సుధా—అవున్లే! పెళ్ళికాబోయే ప్రియురాలి సరసవచో నైపుణ్యంలో పడిపోతే.............

రఘు—(ఖంగారుపడి) చంపేశారు! (అటూ యిటు చూసి) నయమే! చుట్టు పక్కల ఎవరూ లేరు! అదేమిటీ! అమాంతం అంతమాటన్నారు?

సుధా—ఏం? ఏంతమాటన్నాను? ఉన్నమాటేగా?

రఘు—అయితే...మీకు తెల్సునా?

సుధా—నాకేమిటి? అందరికీ తెల్సు - యీ సంగతి.

రఘు—అంతేనా! అందరికీ తెల్సినంతవరకే.మీకూ తెలిస్తే మీకేం తెలియదన్నమాట! అంతవరకే తెల్సా, అంతకంటే ఎక్కువ తెల్సా అని?

సుధా—ఏమిటయ్యోయ్! అధమం నీకు తెల్సినంతా నాకూ తెల్సు.

రఘు—అయితే తెల్సా! ఎలా తెలుసండీ!

సుధా—వేరే ఎట్లా తెలుస్తుందీ!...లలిత చెప్తే తెలుస్తుంది.

రఘు—లలిత చెప్పిందా! లలితే చెప్పిందా!! అవున్లెండి. లలిత చెప్పకపోతే మీ కెట్లా తెలుస్తుంది. కాని నన్నేం చేయమంటారు, చెప్పండి; లలితను చేసుకోవటం నాకిష్టమే; ఇన్నాళ్ళూ నాకు మరో ఆలోచన లేదు; గాని—

సుధా—కాని...?

రఘు—కాని- ఈ మధ్యనే మా అన్నయ్య నుకో సంబంధం తెచ్చాడు. చేసికోమని బలవంతం చేస్తున్నాడు. నాకు ఎటూ తేలక వచ్చి లలిత నడిగితే ఏమందో తెలుసా? "సరే ఆపెళ్ళి చేసుకో" అంది.

సుధా—అనదూ మరి! అనూరాంతంగా నీలో వచ్చిన మార్పును ఆశ్చర్యపోయి "సరే! అల్లాగే పెళ్ళి చేసుకో" అంది.

రఘు—మీతో అట్లా చెప్పిందా? కాని అది కాదు – అసలు సంగతి. లలితకు నామీద అదివరకున్న ఇష్టం యిప్పుడు లేదు.

సుధా—ఎల్లా ఉంటుందీ? నీ మన స్తత్వం తెల్సిన తర్వాత!

రఘు—నా మన స్తత్వం ఏముంది – దీంట్లో? నేనేం నాటకాల్లో Villain లాంటి వాణ్ణనుకున్నారా – ఏమిటీ? మీకసలు సంగతి తెలియదు; మా అన్న అల్లా అన్నాడనీ, వెంటనే తానొక నిశ్చయానికి వచ్చి – వాళ్ళ నాన్నని వప్పిస్తే. పెళ్ళి చేసుకుంటాననీ. నేనాగోజున ఎంత మొత్తుకున్నానో అడగండి.

సుధా—అప్పుడు లలిత సరేనంటే - చేసుకునే వాడివా?

రఘు—మహారాజులాగా! కానీ ఆనాడేమన్నదో తెలుసా! "గతం మరచి పొమ్మనీ. కావాలంటే ఎవరినన్నా చేసుకొమ్మనీ, లేకుంటే బ్రహ్మచారిగా ఉండిపొమ్మనీ, కోరుకుంటే ఆరాధించుకోటానికి తన Photo ఒకటి యివ్వగలననీ" అన్నది. సరేనని వెళ్ళి అన్నయ్య తెచ్చిన సంబంధం ఖాసికి వప్పుకున్నాను.

సుధా—చాలా గ్రంథం ఉందే!
రఘు—ఆ! వచ్చే నెలలో ముహూర్తంగూడా పెట్టారు.
సుధా—(తొందరపడి) అయితే పెళ్ళి చేసుకుంటావన్న మాట.
రఘు—లేదు. ఎట్లా చేసుకోమంటారు?
సుధా—ముహూర్తం పెట్టేరుగా - ఇక అడ్డేముంది?
రఘు—(తెల్లబోయి) అయితే!!!
సుధా—అవునయ్యా! మీ అన్న పెళ్ళి కుదిర్చి; ముహూర్తం పెట్టించె; లలిత ఒప్పుకునే! ఇంకేం.
రఘు—నస్పూ్నరికే వాగించారు గాని - మీ కసలు సంగతి తెలియదన్న మాట.
సుధా—(కంగారుపడి) ఏం? ఏం?
రఘు—సరే లెండి; నయమే; ఇంకా వాగాను కాదు.
సుధా—ఏం? తర్వాత ఏమయిందేమిటి?
రఘు—ఏమైతే ఏం లెండి; నే కాదన్నా - లలిత కాదన్నా- మా పెళ్ళి కాకతప్పదు. ఆ ముసలాయన ఒప్పుకుంటే త్వరలో పెళ్ళవుతుంది. ఏదయితే ఏం? మా తంటాలు మేం పడతాం. మాతో మీరిక నాటకాలాడకండి! వస్తా (వెళ్ళబోతుండగా లలితవచ్చి) "రఘూ! రఘూ! వెళుతున్నావా?
రఘు—(ఆగి) ఆ, ఏం?
లలి—ఆ. ఏంలే. సాయంకాలం ఒక్కసారి వస్తావా?
రఘు—ఎందుకూ? ఇప్పుడు రానూ మళ్ళీ.

లలి—సరే, రా!

రఘు—ఆ! (వెళ్తాడు; లలిత వెళ్ళబోగా)

సుధా—Damit' ఈ నాటక కర్త ప్రమేయం లేకుండానే పాత్రలు ప్రవేశించి - నిష్క్రమిస్తున్నాయి.

లలి—(ఆగి) ఏమంటూరు ?

సుధా—ఏం లేదు; 'అంతా మనం అనుకున్నట్టు జరగదూ' అంటున్నాను.

లలి—అనుకున్నట్టు జరిగితే ఇంకేం? కాని జరగదు; అందులో ఆడవాళ్ళనుకున్నట్లు అసలు జరగదు.

సుధా—మరే! పెళ్ళిళ్ళుగూడా అనుకున్నట్లు జరగవ్! లలితా - ఇష్టం లేకుండా రఘూతో పెళ్ళికెందు కొప్పుకున్నావ్.

లలి—ఇప్పుడా సంగతంతా ఎందుకులెండి, బాధ పడాల్సింది నేను, బాధ పడతాను.

సుధా—బాధేమిటో తెలుస్తే - చేయగల సహాయం చేస్తాంగా!

లలి—మీరు నాకు చేయగల సహాయం ఏమీలేదు కనక చెప్పను.

సుధా—సాయం చేయగలనో-లేదో చెప్పాల్సింది-నేనుగా ?

లలి—చేతనయితే సాయం చేస్తానంటూరా ?

సుధా—ఆ, శక్తివంచన లేకుండా!

లలి—అయితే ఒక అర్థరూపాయి ఖర్చుపెట్టి, పాషాణం తెచ్చిపెట్టండి.

సుధా—ఆ

లలి—ఆ! అదే! పుచ్చుకు చచ్చిపోతాను; మీరు నాటకాల్లో అమాంతం చంపేస్తారుగా, పాత్రల్ని. అలాగే ముగించెయ్యండీ పాత్రనుగూడా; సాయం చేసినవారవుతారు.

సుధా—ఏమిటమ్మా! అనవసరంగా ఉద్రేకం?

లలి—మరో మార్గం లేదుమరి; చెప్పుకోని మనసు తేలిక పర్చుకునేదీ కాదు. చెప్పక మనసులో దాచుకునేదీ కాదు. చావు తప్ప మార్గం లేదు. చావటానికి మార్గందొరకదు క్షమించండి, ఏమిటేమిటో అంటున్నాను. నన్ను కదలించకండి. నా బాధ హృదయంలోనే దాచుకుని బ్రతుకుతాను. (గబగబా వెళ్ళిపోతుంది)

సుధా—ఊహూ. ఇంత Climax ఇప్పుడే పనికిరాదు.

[సుందరరామయ్య ప్రవేశము]

సుంద—ఏమిటీ అంటున్నారు?

సుధా—అబ్బే - ఏం లేదు.

సుంద—ఏమిటో, అమ్మాయితో మాట్లాడుతున్నట్లున్నారు.

సుధా—అమ్మాయితోనే కాదూ! అందరితోటీ మాట్లాడాను.

సుంద.—కథ ఏమైనా కనిపించిందా ?

సుధా—కనిపించింది; వినిపించలేదు; వినటానికి రెండు చెవులూ కావాలనిపించింది గాని, వినే విధం కనిపించ లేదు.

సుంద—మళ్ళీ కవిత్వంలో పడ్తున్నారు; కథ తెల్సుకుని సన్ని వేశాన్ని కావాలన్నట్టుగా నడపడం మర్చిపోయారా ?

సుధా—అసలు కథ తెల్సుకోటానికే ఒక కథ కల్పించా ల్సొచ్చేట్టుంది. ఏదో ఒక కథానన్ని వేశంలో పరవశుల్ని చేస్తేనేగాని పరమ రహస్యం బయటపడేట్టు లేదు. మీరు ఒక పని చేస్తారూ...మీరూ......

సుంద—ఆ...అబ్బ (కడుపులో నొప్పిగా ఉన్నట్లు అభినయి స్తాడు)

సుధా—కడుపులో నొప్పి వచ్చిందా ?

సుంద—ఆ ! అబ్బా !

సుధా—ఎక్కడ నొప్పి ?

సుంద—అబ్బాయిని పిలవండి – అమ్మాయినిగూడా ?

సుధా—ఆ. (లోపలివైపుకు పోయి) లలితా ! లలితా ?

బయటవైపుకు పోయి మూర్తీ ! మూర్తీ ! లలితా మూర్తీ గబగబా వస్తారు]

సుధా—నాన్నగారికి కడుపులో నొప్పి వచ్చింది.

మూర్తి—ఆ !.నొప్పి మళ్ళీవచ్చిందా ?

లలి—డాక్టరుగార్ని త్వరగా పిలవండి.

మూర్తి—పిలవాలండీ. క్రిందటిసారికూడా చాలా ప్రమాదం చేసింది.

సుధా—మరి వెళ్ళిరా - డాక్టరు దగ్గరికి.

మూర్తి—నే వెళ్ళిరానా ? నే వెళ్తే ఎట్లా - మీరే వెళ్ళి రారాదూ ?

సుంద—ఎవ్వరూ వెళ్ళక్కరలేదు. చూడండీ సుధాకరం గారూ ఆ డ్రాయరులో నా విల్లు ఉంది. సంతకం చేసే ఉంచాను. దాని ప్రకారం జరిపే బాధ్యత మీది; వీళ్ళి ద్దరికీ ఇంకా చిన్నతనం; కాస్త కనిపెట్టి ఉండండి...... అబ్బా.........అబ్బా

సుధా—మీరు గాబరా పడకండి. మూర్తీ! తొందరగా వెళ్ళి డాక్టరుగార్ని పిల్చుకురా.

మూర్తి—ఆ. పిల్చుకు వస్తాను.........(వెళ్ళబోగా)

లలి—(వళ్ళు పట్టుకుచూసి) వళ్ళింత చల్లగా ఉందేమండీ. నాన్నా! (మీద పడుతుంది)

మూర్తి—నాన్నా!......(వెళ్ళబోయినవాడు వెనక్కివచ్చి తండ్రిమీద పడ్తాడు.)

సుధా—మూర్తీ! ఏమిటిది నువ్వుకూడా. తొందరగా పోయి డాక్టర్‌గార్ని పిల్చుకురాక. (మూర్తి వెళతాడు)

సుధా—ఏట్లా వుందండీ ? సుందర్రామయ్యగారూ !

సుంద—అబ్బా !

లలి—నాన్నా !

సుధా—లలితా ?

లలి—మీరూరుకోండి, మా నాన్నను నన్ను చూసుకోనివ్వండి.

సుధా—కాస్త ధైర్యంగా వుండమ్మా ! నువ్వే అట్లా అంటే, ఆయన కేం ధైర్యముంటుంది. కాస్త Doctor గారు వచ్చే దాకా ఈయన్ని ఆ గదిలో పడుకోబెట్టి - ఉపచారం చేద్దాం రా. కాస్త సాయం చెయ్యి. సుందర్రామయ్య గారూ - ఆ గదిలో పడుకుందురుగాని - లేవండి.

[ఇద్దరూ పట్టుకొని సుందర్రామయ్యను, నడిపించుకు తీసుకువెళ్తారు. సుధాకరం తిరిగి వచ్చి కుర్చీలో ఆలోచిస్తూ కూర్చుంటాడు- లలిత నిమ్మదిగా డ్రాయరు తియ్యబోతుంది.]

సుధా—నువ్వా వచ్చేశావేం, దగ్గరుండి వేన్నీళ్ళ కాపు పెట్టకపోయావ్ ?

లలి—అందుకే వచ్చాను. Hotwater bag ఈ డ్రాయర్ లో ఉంది. (డ్రాయరు వెతుకుతుంది డ్రాయర్ లోంచి విల్లు కాగితాలు తీస్తుంది

సుధా—ఆ కాగితాలేమిటో ?

లలి—ఏం లేదు; విల్లు కాగితాలు; Hot water bag దీన్లో లేదు.

[కాగితాలు లోపల పెట్టి డ్రాయర్ వేసి వెళ్ళిపోతుంది. డాక్టరు, మూర్తి ప్రవేశిస్తారు]

సుధా—ఓహో! డాక్టరుగారూ! నమస్కారాలు,

డాక్టర్—నమస్కారాలు; ఓ మీరిక్కడే ఉన్నారే! రాత్రి నాటకానికి వచ్చారా?

సుధా—మీరు నాటకం వేయడం, రాకపోవటమూనా!

డాక్టర్—అయితే కనిపించలేదే - మరి, మరెట్లా ఉంది - నా - నా Charector ?

సుధా—ఎట్లా! దిగ్భ్రాంతులమైపోతే!

మూర్తి—నాన్న లోపలున్నాడండీ?

డాక్టర్—ఉంటే - ఉన్నాడులే, ఆగు; చూడండీ, సుధాకరం గారూ; నేను బాగాచేశానా? ఆ శివయ్య బాగా చేశాడా?

మూర్తి—నాన్నకి చాలా ఎక్కువగా ఉన్నదండీ!

డాక్టర్—ఉంటే ఉందిలే, ఆగు; చూడండి; శివయ్య ఆ చివరి సీను ఏడ్చినట్టు చేయలే?

సుధా—అబ్బే! మొత్తుకున్నట్టు చేశాడు. పేషంటు లోపలున్నాడు వెళ్దామా?

డాక్టర్—ఉండనివ్వండి. నేనైతే ఆ Death Scene ఎంత Natural గా చేసేవాణ్ణి.

సుధా—ఓ; చచ్చేట్టు చేసేవారు!

డాక్టర్—ఆ వేషం నాకివ్వమని ఎంత దెబ్బలాడేననుకున్నారు. ఆశివయ్యగాడికి Portion నన్నా బాగా రాదండీ. వాడివన్నీ శుద్ధతప్పులు. ఆచివరను ఏంఅన్నాడో జ్ఞాపకముందా మీకూ? ''విమలా నీకోసం జీవించి ఉన్నాను;

నీకోసం తిండితింటున్నాను. నీకోసం ఊపిరిపీలుస్తున్నాను"
అన్నాడు. Gas. అంతా. సొంత Gas; జీవించి ఉన్నవాడూ
తిండి తినడా ఊపిరి పీల్చడా?

సుధా—(నవ్వుతాడు)

డాక్టర్—అసలు పుస్తకంలో ఉన్న దేమిటో తెలుసా?

సుధా—తెలియదు.

డాక్టర్—తెలియదూ! చూడండీ 'విమలా నీకోసం జీవించి ఉన్నాను. నీకోసమిన్నాళ్లు వేచిఉన్నాను. నీకోసం వేసారిపోతున్నాను.

(Act చేస్తూ చెప్పి - లేచి) ఎలావుంది?

సుధా—బాగుంది.

డాక్టర్—ఎట్లాఉంది నా Delivery

సుధా—Easy గా ఉంది.

డాక్టర్—Pose?

సుధా—భీముడిలాగుంది. ఆ - ఒక్కసారి పేషంటునుచూసి వద్దామేమిటీ?

డాక్టర్—ఆ! ఆ; పదండి (అందరూ లోపలికి వెళతారు... కాసేపటికి లలితవచ్చి డ్రాయర్ తీసి చూస్తుంటుంది. బయటనించి రఘు వస్తాడు]

రఘు—లలితా!

లలి—(కంగారుపడి కాగితాలు దాచెయ్యబోయి) ఓ నువ్వా?

రఘు—ఏమిటా ఖంగారు? ఏమిటది చేతులోది?

లలి—నాన్నగారి వీలునామా.

రఘు—వీలునామా వ్రాసేశారా! ఊఁ - ఏం వ్రాశారు?

లలి—(చూడకుండా దాచేస్తూ) ఆ స్తంతా అన్నయ్యకు.

రఘు—మరి నీకో?

లలి—నాకో పదివేలు.

రఘు—ఇంతేనా?

లలి—అంతకంటే ఎక్కువ రాస్తాడనుకున్నావా?

రఘు—ఆ - రాస్తాడనే అనుకున్నా - లలితా నీకిష్టం లేక పోయినా ఉన్నా - మన పెళ్ళి రాసిపెట్టే ఉంది.

లలి—ఆ! మార్చటానికి వీలులేనంతగా రాశిపెట్టుంది.

రఘు—మార్చటానికి వీల్లేంది మార్చలేం గనుక మార్చటానికి వీలున్నదాన్ని మార్చేయకూడదూ?

లలి—దేన్ని మార్చగలం?

రఘు—ఈ వీలునామాని?

లలి—వీలు నామానా!

రఘు—ఆ! మీ నాన్నతో మాట్లాడు; బ్రతిమాలు; అవసరమైతే అసలు రహస్యం గూడ చెప్పు. ఆస్తి రాయక పోతే నేను పెళ్ళి చేసుకోనని గూడా బెదిరించు.

లలి—నిజంగా చేసుకోవా?

రఘు—అహః! ఉత్త బెదిరింపుకే! కాస్త నటించు!

లలి—నే నటిస్తూనే ఉన్నా; కాని ఆ అవకాశం దాటి పోయింది. నాన్నింకెంతసేపు బ్రతుకుతాడో?

రఘు—ఏం ?
లలి—మళ్ళీ ఆ కడుపు నొప్పి వచ్చింది.
రఘు—వెనక ఒకసారి వచ్చిందేనా ?
లలి—ఆ! అదిగడిచి బయిట పడితేనే-ఏం మార్చటానికైనా?
రఘు—నిజంగా!
లలి—లోపల డాక్టరు పరీక్ష చేస్తున్నారు.
రఘు—పద - చూసివద్దాం...రా...

[ఇద్దరూ వెళ్తారు మరి కొంతసేపటికి మూర్తి బెక రుగావచ్చి వీలునామాను డ్రాయర్ లోంచి తీసి చూస్తాడు - సుధాకరం వచ్చి]

సుధా—ఇట్లా వచ్చేశావేం ? ఏమిటది - చదువుతున్నావ్?
మూర్తి—వీలునామా!
సుధా—వీలునామా! ఎందుకిప్పుడు చదువుతున్నావ్.
మూర్తి—తర్వాత చదివి చేసేదేముంది ?
సుధా—ఏం రాశాడు ?
మూర్తి—మా ఇద్దరికీ చెరిసహం. ఇదివరకు ఒక విల్లు రాసి ఉన్నా, ఇది నిన్నటి తారీఖుది గనుక ఇదే చెల్లుతుంది కాదూ ?
సుధా—ఆ! ఆఖరికి వ్రాసిందే చెల్లుతుంది.
మూర్తి—ఈయన కడుపు నొప్పి నయమై బ్రతికితే చెల్లదు.
సుధా—ఆయన తిరిగి రాస్తే రాసుకోవచ్చు.
మూర్తి—ఆ - ఆస్కారం లేకుండా, ఇదే ఆఖరు ధయితే ఎంత బాగుండును?

సుధా—మూర్తీ !

మూర్తి—తిరిగి ఈయనకు ఈ నొప్పి వస్తే బ్రతకటం కష్టమన్నారు డాక్టర్ గారు.

సుధా—అయితే

మూర్తి—బ్రతికి బైటపడితే విల్లు మార్చేస్తాడు.

సుధా—అందుకని, ఆయన మరణించటం మంచిదంటావా ?

మూర్తి—ఆ ! నా స్థితిలో మీరుంటే, మీరూ అలాగే అంటారు.

సుధా—ఏస్థితిలోనూ, చివరకి నాటకంలో గూడా నేనలా అనిపించలేదు.

మూర్తి—మీకు తెలియదండీ నాస్థితి.

[డాక్టరుగారు - రఘు వస్తారు]

సుధా—ఎలా ఉందండీ ?

డాక్టర్—చాలా బాగుంది.

సుధా—ఏమిటి ? నాడీ - అదీ - బాగానే ఉందిగదా ?

మూర్తి—అయితే బ్రతుకుతారా ?

డాక్టర్—అహం, అది కాదు.

రఘు—అయితే లాభం లేదంటారా ?

డాక్టర్—అబ్బే - అదీ కాదు !

సుధా—మరేమిటండీ బాగుందంటారు ?

డాక్టర్—సన్నివేశం. మీరు నాటక కర్తలుగా; ఎల్లా ఉంది సన్నివేశం; అటూ ఇటూ అయ్యాయి అల్లా ఏడుస్తుంటే, ఈ టీ

అబ్బాయి, ఇలా ఆందోళన పడ్తుంటే, ఇటు నేనూ అటు మీరూ ఉండి సుందర్రామయ్యగారి మాటలు వింటుంటే... ఈ సీను ఎంతరక్తి కడుతుందండీ నాటకంలో అయితే?

రఘు—తొందరగా బాధ తగ్గేట్టు కాస్త మందివ్వండి.

మూర్తి—ప్రాణాపాయముందో - లేదో - అదన్నా చెప్పండి.

డాక్టర్—అబ్బబ్బా ఆగండయ్యా ఆగండి. అసలు పేషంటు కంటే ఈ చుట్టుపక్కలవాళ్ళు మా ప్రాణాలు తీస్తారు. సుధాకరంగారూ; అందుకనే నే నిటువంటి సమయాల్లో ఏదో ఒక పాత్ర నటించి, వీళ్ళని ఊరుకోబెడతా ఇప్పుడూ...

సుధా—ముందు మందివ్వండి. నటించి - తర్వాత చూపెడుదురుగాని.

డాక్టర్—అదేమిటి, ఆమాటకొస్తే మందివ్వటమే ఒక నటన, మీ నాన్నగారి నొప్పి ఒక నటన, నామందు ఒక నటన; మీ అందరిదీ ఒక నటన;...కనక...

సుధా—ముందు - ముందు నటన కానీయండి.

డాక్టర్—ఊ! అంతే నంటారా! అయితే కానివ్వండి; ఇంజక్షనిచ్చొస్తాను. (డాక్టరుగారు మూర్తి లోపలికి వెళ్తారు. రఘు సుధాకరం ఉండిపోతారు)

రఘు—చూశారా, ఆయన స్టిల్లు కూడా రాస్కోవాలేమో?

సుధా—అహా!

రఘు—ఆ విల్లులో లలితకు చాలా అన్యాయం చేసారట!
సుధా—అన్యాయమా? ఏం లేదే.
రఘు—ఏం లేక పోవటమేం? లలిత చెప్పింది; ఒక్క పది వేలు లలితకురాసి – తక్కిందంతా మూర్తికే రాశాట్ట.
సుధా—అంతా మూర్తికా?
రఘు—మీరన్నాకా స్త చెప్పరాదూ; ఇంత ఆస్తుంచుకుని వట్టి పదివేలా ఆడ కూతురికి. పైగా నాకూ అట్టే ఆస్తి లేదుగదా...
సుధా—ఏమో! నీ కెవరెట్లా చెప్పారో, ఆయన విల్లులో మాత్రం అల్లా వ్రాయలా?
రఘు—వ్రాయ లేదంటారేమిటీ లలిత విల్లు చదివి చెప్తే?
సుధా—లలిత విల్లు చదివిందా?
రఘు—ఆ! చదివింది.
సుధా—ఊఁ, ఇదేదో గమ్మత్తుగానే ఉందే!

[లలిత గబగబా వస్తుంది; వెనకనే మూర్తి వస్తాడు]

లలి—చూశారండీ, సుధాకరంగారూ అన్నయ్యా......
మూర్తి—చూశారండీ; సుధాకరంగారూ – లలిత ఏం చేస్తుందో......
లలి—నేనేం చేశానేం?
మూర్తి—రోగి దగ్గర ఆ ఏడుపెందుకూ?
లలి—రోగిదగ్గర అలా నిరుత్సాహపు మాట లెందుకూ?

రఘు—బాగానే ఉంది; అనవసరపు దెబ్బలాట. ఏది ఎట్లా వున్నా శాస్త్ర విల్లూ - గిల్లూ - సరిగ్గా ఉందో లేదో చూసుకోక - ఈ ఘర్షణ పడతారెందుకూ ?

లలి—నీకు తెలియదు నువ్వూరుకో.

రఘు—నాకు తెలియదంటావేమిటి - అర్థం లేకుండా? ఆయన అటో యిటో అయితే?

లలి—అందువల్ల నీకొచ్చిన నష్టంలేదు.

రఘు—పోనీ - నీకుందిగా నష్టం.

లలి—నా నష్టం సంగతి నే చూసుకోగలనులే.

రఘు—(కోపంగా) లలితా!!!

సుధా—ఇంతకూ నువ్వనేదేమిటయ్యా? విల్లు మార్చి వ్రాయించమంటావా ?

మూర్తి—మార్చి వ్రాయించటమెందుకూ ఒక్కసారి రాశిన తర్వాత.

రఘు—వ్రాయటం అన్యాయంగా వ్రాస్తే మార్చవద్దూ?

మూర్తి—అన్యాయంగా వ్రాసేదేముందీ: చెరిసగం వ్రాస్తే.

రఘు—చెరిసహం వ్రాశారా! నిజమేనా - లలితా!

లలి—ఆ. నిజమే.

రఘు—అయితే నాతో అలా అన్నావేం?

లలి—అన్నాను. ఈ సందర్భంలో నీ సంగతి తెల్సుకుందామనీ?

రఘు—ఓ; అయితే ఫర్వాలేదన్నమాట!

సుధా—ఆ, ఫరవాలేదు.

[డాక్టరుగారు వస్తారు]

డాక్టర్—అందరూ ఇల్లా వచ్చేశారేం - నన్నొక్కణ్ణే ఆయన దగ్గర ఒదిలి - ఇంజక్షనివ్వటానికూడా వీల్లే కుండా...

సుధా—ఏదో మాటల్లో ఉన్నారులెండి ఎట్లా ఉంది ఆయన స్థితి?

డాక్టర్—అధ్వాన్నంగా ఉంది.

సుధా—ప్రాణ మోసం ఏం లేదుగదా?

డాక్టర్—లేకేం? కావాల్సినంత ఉంది.

సుధా—మరేదో గట్టిమందు చూడండి.

డాక్టర్—మందు గట్టిదేనండీ; ప్రాణమే గట్టిది కాదు.

మూర్తి—ఇదివరకు పట్నంలోనే అన్నారులెండి - ఈ నొప్పి మళ్ళా వస్తే మరి బ్రతకటం కష్టమని.

రఘు—పెద్దతనం - మందు వంటబట్టటంకూడా కష్టమే.

లలి—దేని సంగతెట్లా ఉన్నా - ఆ బాధ చూడలేకుండా ఉన్నాం.

సుధా—ఆ - పిల్లా - అదీ - వ్రాశేశారు గనక తొందరగా పోయినా ఫరవాలేదు.

డాక్టర్—పోవడం పోకపోవటం - మన చేతిలో ఉందా?

సుధా—మీ చేతిలోనూ లేదూ?

డాక్టర్—లేదు. కాని లేదని మేం ఒప్పుకోం.

రఘు—మీరొప్పుకోకపోయినా - పొయ్యే ప్రాణం ఆగదు లెండి.

డాక్టర్—ఎందుకాగదూ, అది పోదల్చుకోకపోతే తప్పకుండా ఆగుతుంది.

మూర్తి—ఏమిటండీ ? మీ మాటలేం అర్థం కావటంలేదు.

డాక్టర్—అర్థమయ్యేదేముందీ; ప్రాణమోసం ఉన్నా ప్రాణం మాత్రం పోగూడదు.

రఘు
మూర్తి } పోదూ !!!
లలిత

సుధా—పోదనే అంటున్నారు, ఇంతకూ మీకాక్కాల్సిం దేమిటి ప్రాణం పోవాలా ? పోకూడదా ?

రఘు—మనం కావాలంటే - పొయ్యేదైతే పోకుండా ఉంటుందా ?

లలి—చూస్తూ చూస్తూ - ప్రాణం పోవాలనుకుంటామా ?

మూర్తి—క్రిందటిసారిలాగా బ్రతికితే బ్రతకొచ్చుగా !

లలి—మందు వంటపట్టాలిగాని, పడితే - మూడు నిమిషాల్లో పనిచేయదూ?

రఘు—డాక్టర్‌గారి మందు ఒక్కొక్కప్పుడు బాగానే పని చేస్తుంది.

డాక్టర్—కాని ఇప్పుడు పనిచేస్తుందో - చెయ్యటంలేదో, ఏదీ తేలకుండా ఉంది. పనిచేస్తే ఈపాటికి తగ్గిపోవాల్సిందే.

సుధా—మరి తగ్గలేదే?

డాక్టర్—అదే ఆలోచిస్తున్నాను; దానికితోడు నాడికూడా కాస్త అనుమానంగానే ఉంది.

సుధా—అంటే?

డాక్టర్—అంటే చూశారూ? అసలే అలిసిపోయిన ముసలి గుండె! రోగమూ - అసాధ్యమైంది! ఇటువంటి గుండెల్ని నమ్మి మనం ఏంచెయ్యటాన్కీ వీల్లేదండీ! పైగా శ్వాస కూడా బయల్దేరింది.

రఘు—నాడీ బాగుండక - శ్వాసా బాగుండక-మరేం బాగున్నట్లు?

డాక్టర్—అదే ఆలోచిస్తున్నా ఏదా అని?

మూర్తి—డాక్టర్‌గారూ! తేల్చిచెప్పండి; అదెట్లా ఉన్నా, ముందు మమ్మల్ని చంపేస్తున్నారు.

డాక్టర్—నే తేల్చేదేముందయ్యా! ఇంజక్షన్ ఇచ్చానా? అది తేల్చేదాకా నే నిక్కడే ఉంటాను.

సుధా—ఏది తేలినా - ఏదితేలకపోయినా ముందు మీసంగతి తేలిపోయింది.

మూర్తి—అదేమిటీ?

సుధా—విల్లు మీకిష్టంగానే ఉందిగనక - ఆయన పోయినా ఫర్వాలేదనీ - పోతేనే మంచిదనీ.

మూర్తి—అని ఎవరన్నారు?

సుధా—మీరు ముగ్గురూనూ,

మూర్తి—ఇదేమిటండోయ్! ఎప్పుడన్నాం?

సుధా—ఇప్పుడే. మనసా - వాచా, మీరంటున్నదదే - ఇంతకూ డాక్టరుగారూ, మీకు శ్రమ యిచ్చినందుకు క్షమించండి.

డాక్టర్—నాశ్రమ ఊరికే మాటలతో తీరదులెండి. Bill మాత్రం మామూలుకంటే ఎక్కువగానే చేస్తాను. పిలవ్వయ్యా! మీనాన్నను ఇటు పిలూ.

మూర్తి—ఏమిటండీ ఇది! ......

డాక్టర్—ఏంలేదు. సుందర్రామయ్యగార్ని ఒక్కసారిటుపిలు.

(మూర్తి వెళతాడు)

రఘు—ఏమిటండీ ఇది - సుధాకరంగారూ?

సుధా—ఏంలేదు. సుందర్రామయ్యగారూ, నేనూ, ఒక సన్నివేశాన్ని మాకనుకూలంగా మార్చుకుని, కొన్ని సంగతులు తెలుసుకొన్నాం! అంతే!

రఘు—మరి కడుపునొప్పి - ఈగల్లంతూ ఏమిటి?

సుధా—ఏంలేదు; అంతే...

డాక్టర్—కాని అమాంతంగా నన్ను పిల్చి, రోగినిచ్చి, వైద్యం చెయ్యమంటే అర్థమేమిటండీ? నటకుణ్ణి కాబట్టి సరిపోయింది; మరొకడాక్టరైతే ఈపాటికి ఎన్ని ఇంజక్షన్‌లిచ్చేవాడో!

రఘు—మీరూ ఇచ్చారుగా.

డాక్టర్—ఇవ్వలేదులే; నాకనుమానంగా ఉండి మీరందరూ ఇవతలికొచ్చాక ఇదొక మహావ్యాధి ఆపరేషన్ చేస్తాను

చేయించుకుంటారా అన్నా. వద్దండీ. నాకేంలేదు, ఇదంతా నటన; మీరూ కాసేపు నటించండి. అని ఆయనే అన్నారు. సుధాకరంగారూ! నేను బాగా నటించలే?

సుధా—అద్భుతంగా నటించారు.

డాక్టర్—మరి నాఫీజుగా - నాకో నాటకం వ్రాసివ్వరూ?

సుధా—అల్లాగే.

డాక్టర్—దాంట్లో నేను హీరోగా ఉండాలి సుమండీ

సుధా—తప్పకుండా!

[సుందరరామయ్యగారూ, మూర్తి ప్రవేశము]

సుందరరామయ్యగారూ - అయిపోయింది మననాటకం.

సుంద—ఏమైందంటూరు?

సుధా—ఇంకేంకావాలి వీళ్ళిద్దరికీ మీరు ఆస్థి ఎలావ్రాస్తారో అని అనుమానంకల్గింది. అందుకని ఇద్దరూ మీ మీ దింత అపేక్ష చూపిస్తున్నారు. మీవిల్లు దొంగతనంగా ఇద్దరూ చదివారు. విల్లు అనుకూలంగానే ఉందనుకొని, ఇకమీరు మరణించినా ఫరవాలేదనుకున్నారు. మీ మీదెంత అపేక్షగనబర్చినా ఇద్దరి ఆంతర్యం ఇదీ.

మూర్తి—చాల్లెండి ఆగండి! లేనిపోని వ్యాఖ్యానాలు కల్పించకండి.

సుధా—వ్యాఖ్యానమేముందీ? మీ మాటల్లో తేలిందదే.

సుంద—క్షమించండి—సుధాకరంగారూ; దీనివల్లేమీ ప్రయోజనం కలుగ లేదు. కష్టం, వేశం మన కనుకూలంగా మారకపో

లేదు. మూర్తీ! డాక్టర్ గారి నందాకా పంపిరా! డాక్టర్ గారూ! Bill నిమ్మదిగా పంపించండి.

డాక్టర్—ఆ! అలాగే సుధాకరంగారూ; నాకు సరైన పాత్ర మీరే వ్రాసివ్వాలి. జ్ఞాపక ముంచుకోండి. వస్తాను.

(డాక్టరుగారు, మూర్తి వెళతారు)

సుంద—సుధాకరంగారూ నేనూ వస్తా, ఈ విల్లు పనై పోయిందిగా; చింపేస్తా; ఆ! ఇప్పుడే వస్తా; వచ్చేదాకా ఉండండి (వెళతాడు)

లలి—సుధాకరంగారూ!

సుధా—ఏవమ్మా?

లలి—మీరేదో సన్నివేశంలో మమ్మల్ని పెట్టి సంగతులు తెల్పకుండా మనుకున్నారు కాదూ?

సుధా—ఆ...

లలి—మీకు తెల్సిందాంట్లో అసలు సంగతేం లేదు. అంతే నే చెప్పదల్చుకుంది, సెలవు. (వెళుతుంది)

సుధా—ఆ! ఇంకా ఏమన్నా వుందా ఏం! (తెల్లబోయి నుంచుంటాడు)

రఘు—ఆ.

సుధా—ఇంకేం ఉన్నాయబ్బా!

రఘు—ఓ; చాలా ఉన్నాయి, లలిత చెప్పింది నిజం. మీకు తెల్సినదానికంటే - తెలియందే యెక్కువ. అది చెప్పటానికే ఆగాను. వస్తా!

[రఘు లోపలికి వెళతాడు. సుధాకరం ఆలోచిస్తూ నిల్చుని ఉండగా మూర్తి బయటనించి వస్తాడు]

మూర్తి—వీళ్ళందరూ ఏరీ? మీరొక్కరే ఉన్నారేం?

సుధా—లోపలి కెళ్ళారు.

మూర్తి—ఆ-సుధాకరంగారూ...సన్నివేశాన్నేదో మీరు మార్చుకో దల్చుకున్నారుగాదూ? అందుకనేగా ఈ నాటక మాడారు.

సుధా—అవును.

మూర్తి—కాని మీరు కాదు సన్నివేశాన్ని అనుకూలంగా మార్చుకున్నది.

సుధా—మరెవరూ?

మూర్తి—మీరు కాక అందరూనూ.

సుధా—నేను కాక అందరూనా?

మూర్తి—ఆ! అందరూ. అదే నే చెప్ప దల్చుకున్నది. వస్తాను. (వెళతాడు)

[సుందరరామయ్య ప్రవేశం]

సుంద—సుధాకరంగారూ! అందరూ లోపలికి వెళ్ళారుగా... ఆ...మీతో ఒక్కమాట చెప్పాలి. శ్రమపడినా మన నాటకం తగిన ఫలితాన్నివ్వలేదు.

సుధా—అది చెప్పటానికేనా ఉండమన్నారు?

సుంద—ఆ! అదే! అదే! వాళ్ళిద్దరూ మన్ని టోపీలో వేశారు.

సుధా——ఆ సంగతి కనిపిస్తూనే ఉంది. కాని మీరు నాకూ టోపీ వేశారల్లే ఉంది!

సుంద——ఆ లెక్కలు తర్వాత తేల్చుకుందాం...గాని... నాటక మింతటితో ఆపకండి, రెండో రంగం ప్రారంభం చేయండి.

సుధా——ఏదైనా మొత్తానికీ రంగం రక్తికి రాలేదు.

సుంద——ఆ అలాగే ఉంది; అది చెప్పటానికే వచ్చా! ఒక సారి Post officeదాకా వెళ్ళివస్తా; అర్జంటు ఉత్తరం ఒకటి రావాలి. మీరు కాసేపుండి రఘూ లలితల్ని కనిపెడ్తూ ఉండండి. వస్తాను.

[బైటికి వెళతాడు - కాసేపటికి డాక్టరుగారు గబ గబా వస్తారు]

డాక్టర్——మీరిక్కడే ఉన్నారా! మీరిక్కడే ఉన్నారా?

సుధా——ఏం? మళ్ళీ వచ్చారేం? ఏం చెప్పటానికి?

డాక్టర్——నా కారులో...నా కారులో...(చెమట తుడుచుకుంటాడు)

సుధా——ఆ...కారులో?

డాక్టర్——(జేబులోంచి ఒక చీటీతీసి [illegible] దొరికింద దారిలో చూచుకున్నా.

సుధా——ఏమిటది? (తీసుకు చదువు[illegible])

"డాక్టర్‌గారూ! తమరు కొం[illegible] [illegible]వర్తించటం మంచిది. ఇక ఎప్పుడూ ఇవ్వాల్టికిమల్లె అనవసరపు

వ్యవహారాల్లో జోక్యం కల్గించుకోవద్దు.........ప్రాణాల మీద ఆశవుంటే''

డాక్టర్—చూశారూ ''ప్రాణాలమీద ఆశవుంటేట'' ట. మొదట కాస్త ఖంగారుపడ్డాను. మళ్ళీ తిరిగి చదివితే ఏమీం అర్థంకాలేదు. ఎవరువ్రాసినట్లు, ఎవరుపదేసినట్లు?

సుధా—మీవెంట మూర్తి ఒక్కడేగా వచ్చింది.

డాక్టర్—అవును - గాని - అతనే వేశాడంటూరా?

సుధా—అరవకండి. మన మొక పనిచేద్దాం. మాట?

డాక్టర్—ఏమిటి?

సుధా—రేపీపాటికి మీరేదో మిషకల్పించుకుని ఇక్కడకు రావాలి. మీరొచ్చేటప్పటికి నేనిక్కడే వుంటాను. మీరు వచ్చి - దగ్గరకురండి......

(చెవిలో రహస్యంగా ఏదో చెప్పి)

అని చెప్పండి.

డాక్టర్—ఎందుకండీ?

సుధా—ఫరవాలేదు. ఈ ఒక్కమాటూ చెప్పండి. సన్ని వేశం నడపాలంటే ఏదో ఒకటి ఉండాలిగా?

డాక్టర్—నన్నీనాటకంలో Villain చేసి, మీరు Hero అయి పోవాలని చూస్తున్నారేమిటీ?

సుధా—అబ్బ! మిమ్మల్నే Hero గా చేస్తానుగా. ఫర్వాలేదు. అలాచెప్పండి.

డాక్టర్—సరే మరి వెళ్ళిరానా!

సుధా—ఆ - అలాగే.

—: తెర :—

## రెండవ రంగము

[అదే గదిలో సుందర్రామయ్య కూర్చుని ఏదో వ్రాసు కుంటుంటాడు. సుధాకరం పచార్లు చేస్తుంటాడు.]

సుధా—సుందర్రామయ్యగారూ!

సుంద—ఆ! (తలెత్తి చూస్తాడు)

సుధా—నిన్న మనం సన్నివేశాన్ని సరిగ్గా అర్థంచేసుకో లేదు.

సుంద—ఏం?

సుధా—ఏం లేదు; మనకు తెలియనిదేదో ఇంకా ఉన్నట్టుంది.

సుంద—(వ్రాత తిరిగి ప్రారంభిస్తూ) ఏముంటుంది?

సుధా—వాళ్ళిద్దరూ ఎక్కువ మక్కువ చూపించటానికి ఏదో కారణం ఉంటుందని ఆశించాం.

సుంద—మరి ఉండదూ!

సుధా—వాళ్ళల్లా నటించటం – మీఅనురాగం సంపాదించు కోటానికే అయి ఉండాలి.

సుంద—అంతే అయిఉండాలి.

సుధా—అవునా! మరి – తండ్రికి తన సంతానంమీద అను రాగం లేదని వాళ్ళెందుకు కనుకున్నారో?

సుంద—(తలఎత్తి ఆలోచించి) ఏమో! (తలఊపి నవ్వు కుంటాడు)

సుధా—(అది గ్రహించి) ఊఁ. (సందేహిస్తూ) ఆకారణం ఏదైనా "మీకు్కూడా తెలియకుండా ఉంటుందా" అని.

సుంద—నాకు తెలిసినంతవరకూ ఏమీ లేదు నేనందర్నీ ఒక లాగే చూస్తున్నాను.

సుధా—ఏ భేదం లేకుండానే! మరి మీవిల్లు చింపేశారేం! ముందుకు అదే పనికివస్తుందిగా?

(సుధాకరం Table దగ్గరకువస్తాడు, సుందర్రామయ్య వెంటనే Drawer లో ఏదో పెట్టి మూస్తాడు.)

సుంద—నిన్న వ్రాసిందేనా! అది వాళ్ళసంగతి తెల్సుకోండా మని వ్రాసిందేగా; అది అల్లా వ్రాయాలనే వ్రాశాను.

సుధా—ఆ! ఎంత గొప్పగానటిస్తారండీ మీరు! ప్రపంచంలో అందరూ మీలాంటి నటకులైతే, ఇక నాటకాలు నేను వ్రాయటమెందుకూ?

సుంద—అట్లా అన్నారేం?

సుధా—మీ కుటుంబాన్ని రంగస్థలం ఎక్కిస్తే రచయిత లేకుండానే రోజు కో నాటకం ఆడేస్తారు.

సుంద—(నవ్వి) లేచి వ్రాసిన కాగితం కవరులో పెట్టి అంటిస్తూ) అవునవును "ప్రపంచమంతా నాటకరంగం వివిధాకృతులతో సన్నివేశములు; విధించి నడిపే విధాత ఎవడో ?

సుధా—ఎవడో ?

సుంద - వస్తా! ఈ కవరు పోష్టులో పడేసిరావాలి.

(వెళ్ళబోతుండగా)

సుధా—Post లో పడెయ్యటానికి మీరే వెళ్ళాలా! ఎవరి నన్నా పంపరాదూ?

సుంద—కాదులెండి; కాస్త జాగ్రత్తగా వెళ్ళాల్సిన ఉత్తరం (వెళ్ళబోతూ వెనక్కు తిరిగి) ఆ. మూర్తి లోపలే ఉన్నాడు - పిలిచి కదిలించండి.

సుధా—అల్లాగే. (సుందర్రామయ్య వెళతాడు)

(సుధాకరం ఆఫీసు గది దగ్గరకు వెళ్ళి)

మూర్తి! ...మూర్తి!......మూర్తి

మూర్తి—(వచ్చి) ఓ మీరేనా?

సుధా—అవును నేనే! మీ నాన్నగారు Post లో ఉత్తరం వెయ్యటానికి వెళ్ళారిప్పుడే. వస్తా ఉండమన్నారు.

మూర్తి—Post లో వెయ్యటానిక్కాదూ? అవును నాకూ తెలుసు.

సుధా—నీకు తెల్సా! -

మూర్తి—దాని సంగతంతా చాలా ఉందిలెండి; నాకూ బాగా తెలియదు.

సుధా—పోన్లే! నాతో చెప్పగూడనిదైతే - చెప్పొద్దు - కాని నువ్వేదో మనసులో బాధపడ్తూ - ఇల్లా దిగులు పడిపోవటం నాకేం బాగలేదు.

మూర్తి—దిగులా?

సుధా—ఆ! దిగులుగా - పరధ్యానంగా ఉంటున్నావు. మీ కుటుంబంలో ఉన్నదే - ముగ్గురూ; ఒకళ్ళి నొకళ్ళ

అర్థం చేసుకోకుండా సతమతమవుతున్నారు. అందులో నువ్వు మరీనీ.

మూర్తి—ఉంటే ఉన్నానేమో! ఏమో! దిగులుగానే ఉన్నాను. దాచుకోలేనంత దిగులుగా ఉన్నాను.

సుధా—దిగులుపడి ఏం ప్రయోజనమోయ్, పిచ్చివాడా! అదేమిటో నాతో చెప్పు; దాని సంగతి నేను చూస్తాను.

మూర్తి—చెప్పేం లాభం లేదు. అయినా చెప్తాను; చెప్పక పోతే నేనేదో ద్రోహం తలపెట్టాననుకుంటారు గనుక - చెప్తాను. నాకు లక్షరూపాయిలు కావాలి.

సుధా—లక్షరూపాయిలా! ఎందుకూ శారదను పెండ్లాడేందు కేనా?

మూర్తి—అవును; అందుకే; మా నాన్న ఆస్తి నాకేంరాదు. అందుకని - నా అంతట నేనే సంపాదనకు పూనుకున్నాను.

సుధా—లక్షరూపాయలు సంపాదించాలనే! - నీ అంతట నువ్వు!

మూర్తి—ఆ - ఆ - రాత్రి పగలూ కష్టపడి సంపాదిస్తు న్నానుగూడా...

సుధా—అహా! అదా! - రాత్రిపూట కార్లు క్లీన్ చేసి ఆయిల్ చేసే కంపెనీ పెట్టావట - ఇందుకే నన్నమాట.

మూర్తి—ఏమిటీ!!

సుధా—రాత్రిపూట కార్లు క్లీన్ చేసి.....!

మూర్తి—మీకెలా తెలుసు?

సుధా—శారద వాళ్ళింట్లో చెప్పారు; ఈ ఉదయం వాళ్ళింటికి వెళ్ళానులే.

మూర్తి—అరి భగవంతుడా! వాళ్ళకూ తెలుసూ?

సుధా—ఆ—ఆ! ఇదంతా శారద కోసమేననికూడా తెల్సు.

మూర్తి—ఇప్పుడెట్లా! నేనెన్నాళ్ళు సంపాదిస్తే లక్షరూపాయలు అవుతుందీ. నాన్న ఆస్తి కొంతైనా వస్తేగాని లక్ష కాదు.

సుధా—మీ నాన్నగారి ఆస్తి నీకెందుకు రాదు?

మూర్తి—రాదు. ఎందుకైతే ఏం? రాదు. అంతే, సుధాకరంగారూ! సన్నివేశాల్ని మీరూ నేనూ మార్చలేం. కానీయండి, ఏదో ఒకటవుతుంది.

సుధా—అయితే మీనాన్న ఆస్థి నీకు దక్కనివ్వడంటావా?

మూర్తి—దక్కనివ్వడు. ఆయన నాకు శాయశక్తులా ఆస్తి దక్కనివ్వకుండా చేస్తాడు; చేస్తాడేమిటీ? ఇదివరకే చేశాడు; వాగించకండి వాగించకండి అదంతా నాచేత.

(బయటికి వెళ్ళిపోతాడు)

సుధా—మూర్తీ! మూర్తీ!

[లలిత ప్రవేశించి]

లలి—ఏమిటండీ! ఏమిటండీ అది?

సుధా—ఏం లేదు.

లలి—మూర్తి అలా కేక లేస్తున్నాడేమిటి?

సుధా—మరేం లేదు. ఆ శారద పెళ్ళి విషయం ఏదో వచ్చి కాస్త ఉద్రేక పడ్డాడు. నీకు తెలియదూ? శారదంటే మన...

లలి—"రావ్ బహద్దూర్‌గారి కూతురు (అని ఎద్దేవగా అంటుంది) ఆమెగారు నా స్నేహితు రాలేలెండి; దాన్ని చేసుకుంటే భాగానే కుదురుతుంది – రోగం.

సుధా—ఏం? అలా అన్నా వేం?

లలి—దానంత గర్వపోతుందా ప్రపంచంలో.

సుధా—కాని ఏమైనా మూర్తికి నచ్చింది; ప్రపంచంలో నచ్చినవాళ్ళు పెళ్ళి చేసుకుంటూరు, నచ్చని వాళ్ళను పెళ్ళి చేసుకొనే వాళ్ళను ఎక్కడా చూడలేదు గాని, కాని...

లలి—అదిగో, మళ్ళా నా మీదకు త్రిప్పుతున్నారు.

సుధా—అబ్బ! ఎంత త్వరగా గ్రహిస్తావ్! నిజం చెప్తున్నా- లలితా మీ ముగ్గురి సంగతీ నాకేం అర్థం కావటంలేదు. ఉన్నది ముగ్గురూ ఎంతో అనురాగాపేక్షలతో ఉండా ల్సింది. అటువంటిది – పైకి అనురాగపు నటన, లోపల అనుమానం – ఎందుకో నా కర్థం కావటం లేదు.

లలి—అవును. మీ కర్థం కాదు. మీ కసలు సంగతులేం తెలియవు గనుక...

సుధా—తెలియని విషయాలు తెలిసేటట్టు చెప్పరాదూ?

లలి—ఒద్దు. మా తంటాలు మేం పడతాం. ఆ విషయాలు అడగనే వద్దు.

సుధా—ఊఁ (నిరాశగా అంటాడు)

[డాక్టరుగారు ప్రవేశము]

డాక్టర్—ఉన్నారా సుధాకరంగారూ! మీ కోసం మీ ఇంటికి కూడా వెళ్ళి వచ్చాను. మీరు మా ఇంటికి రావా లొకసారి,

సుధా—ఎందుకూ ?

డాక్టర్—మరేంలేదు, మా చెల్లెల్ని మన రఘు కివ్వాలని నిశ్చయించా.

సుధా—అహః! రఘూ ఒప్పుకున్నాడా!

డాక్టర్—ఆ! వాళ్ళ అన్న ఒప్పుకున్నాడు; మా అమ్మ ఒప్పుకుంది. ఇవ్వాళ తాంబూలాలు పుచ్చుకోవాలి.

లలి—తాంబూలాలు కూడానా ?

డాక్టర్—తాంబూలాలు పుచ్చుకుంటే త్వరలోనే ముహూర్తం పెట్టించి...

లలి—(కోపం. పట్టలేక, కసితో) పెళ్ళి చేస్తారు, పెళ్ళి చేస్తారు...(దుఃఖం పొంగి వస్తుంటే వెళ్ళిపోతుంది)

డాక్టర్—అదేమిటండీ అలా వెళ్ళి పోయిందీ ?

సుధా—ఏం Exit బాగుండలా ?

డాక్టర్—బాగా లేకేం! బాగానే ఉంది. కానీ నేనైతే ఈ Exit ఎలా యిస్తా నంటే. (తాను నటించ బోతాడు)

సుధా—తర్వాత నటించి చూపెడుదురుగాని; మూర్తి వస్తున్నాడు. అటు చూడండి.

డాక్టర్—రానివ్వండి (రహస్యంగా) తోటలో ఒంటరిగా ఉంటే రమ్మని కేకేశాలెండి.

[మూర్తి ప్రవేశం]

డాక్టర్—ఆ! సుధాకరంగారూ, దీనితోపాటే మన పెళ్ళి కూడా!

సుధా—మన పెళ్ళా ?

డాక్టర్—అదే! నా పెళ్ళి; ఇంత Common-wit వచ్చినా ఒదలి పెట్టరేమండీ.

మూర్తి—మీ పెళ్ళి Settle చేశారండీ! అహా ఎప్పుడేం?

డాక్టర్—త్వరలోనే! వేచి ఉండుడు; వేచి ఉండుడు.

మూర్తి—కాచుకునే ఉంటాం. మాకేం తొందర లేదు. కాని ఎవరితోనేం ?

డాక్టర్—అదే! ఆ అమ్మాయి (జ్ఞాపకంరాక తడుము కుంటూ) ఎవరమ్మా - అదే నండి...ఎఱ్ఱగా...సన్నగా-

మూర్తి—ఆ! ఆ! (తనకూ తెల్సినట్లు వేళాకోళంగా) నాజూగ్గా - సుకుమారంగా ఉంటుందీ? ఆ పిల్లేనా?

డాక్టర్—ఆ! ఆ పిల్లే! నీకెలా తెల్సు ?

మూర్తి—తెలిసింది లెండి.

సుధా—మూర్తికి తెలిసిందేమో నాకు తెలియలా ?

డాక్టర్—అదేనండీ రావ్ బహద్దూర్ వారమ్మాయి శారదతో.

మూర్తి—శారదతోనా! శారదతోనా! (తెల్లబోయి ఖంగారు పడ్డాడు)

డాక్టర్—ఆ. శారదతోనే, అదే - ఎఱ్ఱగా - నాజూగ్గా - ఉంటుందే, (మూర్తి ఖంగారుపడటం గమనించి) ఏం సల్ల బడ్డావ్. నువ్వెరుగుదువా ఆపిల్లని?

మూర్తి—అ-! అ-!

సుధా—ఆ! ఎరుగున్నాడు లెండి?

డాక్టర్—అయితే ఎట్లా ఉంటుంది - మా Match? ఆ-ఏం? మాట్లాడవేం! (సుధాకరంతో)...మాట్లాడడేమండీ... ......మూర్తీ.........

సుధా—ఏమో, డాక్టర్లు మీరే చెప్పాలి.

మూర్తి—వస్తానండీ, ఇప్పుడే వస్తా. (మేలుకొన్నవాడిలా వెళ్ళబోగా)

సుధా—ఎక్కడికోయ్?

డాక్టర్—ఏమిటాగాభరా?

మూర్తి—ఏం లేదు లెండి; వస్తా - (వెళతాడు)

డాక్టర్—(తెల్లబోయి) ఏమిటండీ? అలా వెళ్ళిపోయాడేం?

సుధా—ఏం లేదు.

డాక్టర్—నన్నో నాటకంలో పాత్రను చేసి ఆడిస్తున్నారా ఏం?

సుధా—నాటకమేగా! ఫర్వాలేదు. నాటకం వ్రాసియిస్తానన్నానుగా, అదిగో - రఘు వస్తున్నట్లున్నాడే!

డాక్టర్—రఘూ? ఇక్కడికే? అయితే - నేవెళ్తాను.

సుధా—ఫర్వాలేదు; ఉండండి. (రఘు ప్రవేశము)

రఘు—ఓ; మీరిక్కడే ఉన్నారే? లలిత లోపలుందా?

(లోపలికి వెళ్ళబోతాడు)

సుధా—ఏం హడావుడి? లలిత నివతలికి, పిలుస్తానాగు, (దర్వాజాదగ్గరకుపోయి) లలితా! లలితా! రఘూ వచ్చాడు నీకోసం - ఏదో మాట్లాడాలిట,

లలిత——(లోపల్నించే) అక్కర్లేదు వెళ్ళ మనండి.

రఘు——ఏమిటది?

సుధా——అక్కర్లేదు - వెళ్ళమంటోంది.

రఘు——కాదండీ! ఒక్కసారి మాట్లాడాలి - మా పెళ్ళి విషయం.

సుధా——కాదటమ్మా లలితా! ఒక్కసారి మాట్లాడాలిట - అదే - మీ పెళ్ళివిషయంట.

లలిత——(ప్రవేశించి) పెళ్ళివిషయమా! పెళ్ళివిషయం మాట్లాట్టానికి వచ్చాడా! సిగ్గులేకుండా (కోపంగా అంటుంది.)

సుధా——ఏమయ్యా! ఏదో అడుగుతుంది. చెప్పు.

రఘు——నేను............

లలిత——అక్కర్లేదు - ఏంచెప్పనక్కర్లేదు; సిగ్గుంటే త్వరగా బైటికి పొమ్మని చెప్పండి. లేకుంటే నేనే బైటికి గెంటిస్తానని చెప్పండి.

రఘు——లలితా! ఏమిటిది?

లలిత——ఓ! లలితంటే ఏమిటో ఎట్లాచెప్పడం? చేతిలో కర్ర వుంటే తెలిసేది - లలితంటే ఏమిటో!

రఘు——తెల్సు! నీసంగతి బాగా తెల్సు. వళ్ళు తెలియని కోపం! ఛీ......తర్వాత కల్సుకుంటానండీ, సుధాకరంగారూ (వెళతాడు)

లలిత——డాక్టర్ గారూ! మీతోపాటు వట్టిమాటలు మోసుకురాకపోతే, ఇంత పాపాణాన్నికూడా తేలేకపోయారా (వెళుతుంది)

డాక్టర్—సుధాకరంగారూ! మీరేపాత్ర నిర్వహించమన్నా నిర్వహిస్తాగాని ఈ Villain పాత్ర నాచేతకాదండీ.

సుధా—(నవ్వి) తొందరపడకండి.

డాక్టర్—మీరెన్ని చెప్పినా సరే - ఈఘోరం నే చెయ్య లేను.

సుధా—కాని నాటకం రక్తికట్టాలంటే......(అర్థోక్తిలో.)

డాక్టర్—దానిదుంప తెగిరి; నాటకం రక్తికట్టలేదని, విషాదాంతం చేసుకుంటారావరా?

సుధా—నేను నాటకాన్ని సుఖాంతమే చేస్తాగా!

డాక్టర్—ఇంకా ఏం సుఖాంతం? అన్ని పాత్రలూ తెంపుకొని నిష్క్రమిస్తుంటే.

సుధా—పాత్రలు నిష్క్రమించినా, తిరిగి ప్రవేశిస్తాయిలెండి;

డాక్టర్—ఏమోబాబూ! మీరాడే నాటకం ఏదైనా గానీయండి! నన్ను Hero చేసెయ్యండి; ఈజగన్నాటకంలో నేను Villain ని కాలేదు. కావాలంటే మీరు రాసిచ్చే నాటకంలో నన్ను Villain న్ని చేద్దురుగాని.

సుధా—సరేలెండి; ఇంకా ఒక్క సన్నివేశం ఉంది. దాంతో నాటకం Climax కి పోతుంది. Climax కి పోయింతర్వాత పాత్రల ముక్కులకు త్రాళ్ళుగట్టి నడిపించటమే. అదీ అయిపోనివ్వండి, (వెళ్ళి Drawer తీసి ఏదో వెతుకుతుంటాడు)

డాక్టర్—మీరెంత రచయితలైనా మా ముక్కులకు త్రాళ్లు గట్టి నడిపిస్తానంటే ఎలా? ఏమిటీ వెతుకుతున్నారు?

సుధా—ఏం లేదు. దీన్లో సుందర్రామయ్యగారేదో దాచారు.
అదేమిటో చూద్దామని, ఇదిగో - (ఒక Photo తీస్తాడు)

డాక్టర్—ఏమిటది?

సుధా—Photo.

డాక్టర్—Photo కన్పిస్తూనే ఉంది. ఎవరిదీ?

సుధా—ఒక కుర్రాడిది.

డాక్టర్—కుర్రాడిదని నాకూ తెలుస్తూనే ఉంది! ఎవరీ కుర్రాడు?

సుధా—చెప్పండి - మీరే?

డాక్టరు—సరే నన్ను 'Detective' ని అవమంటారేమిటి?

సుధా—మీరు అవకపోతే నేనవాల్సివచ్చేట్టుంది.

డాక్టర్—మీకూ తెలియదా ఏం?

సుధా—తెలియదు, (ఆలోచిస్తూ) సరే. మీ పాత్రకు మరొక పనికూడా ఉంది.

డాక్టర్—మళ్ళీ పెట్టారూ?

సుధా—మరేం లేదు; మీరిక్కణ్ణించి వెళ్తూ, దోవలో రఘూని కల్సుకుని "లలిత నిన్ను తూలనాడినందుకు చాలా విచారిస్తోంది ఒక్కసారిక్కడకు నిన్ను రమ్మంది" అని చెప్తారూ!

డాక్టర్—కానీ - లలిత విచారించటం లేదే?

సుధా—మీరు వెళ్ళి రఘూని పంపేలోగా విచారిస్తూంటుంది లెండి.

డాక్టర్—సరే మీరా చిత్తం – అతన్ని పంపిస్తా – వస్తా.

[డాక్టర్‌గారు వెళ్ళారు. సుధాకరం ద్వారం వద్దకువచ్చి]

సుధా—లలితా! లలితా!

లలి—(వచ్చి) పిల్చారా?

సుధా—ఆ! ఇల్లా రా కూర్చో.

లలి—ఎందుకూ?

సుధా—మరేం లేదులే. అమ్మా. గాభరాపడకు. రాకూర్చో

లలి – అహాఎక్కడ లేని కరుణారసం వలికిస్తుంటేనూ, ఆశ్చర్య పోయాను.

సుధా—ఆశ్చర్యమేముందీ? నిన్ని పరిస్థితుల్లో చూస్తుంటే జాలి ఎవరికుండదు? – మరైతే – ఇప్పుడేం చేస్తావ్?

లలి—ఏం చెయ్యనూ?

సుధా—అహా! రఘు వేరే పెళ్ళికి ఒప్పుకున్నాడు గదా?

లలి—అవును. దానికి నేనేం చెయ్యనూ!

సుధా—అతని సంగతి అతనుచూసుకుంటున్నప్పుడు, నీసంగతి నువ్వు ఆలోచించుకోవద్దూ? వేరే ఎవర్నన్నా పెళ్ళి చేసుకోవడమో – లేకపోతే......

లలి—నేనా! మరెవర్నన్నా, చేసుకోనా!

సుధా—ఆ! అతను వేరే పెళ్ళికి ఒప్పుకున్నాడు గనక...

లలి—అయితే ఒక్కమాట; మీరు పెళ్ళి చేసుకుంటారా నన్ను.

సుధా—నేనా! (తెల్లబోయి) నీలాంటివాళ్ళు అకస్మాత్తుగా అడిగితే కాదనటం కష్టమే; – కానీ – నాకిప్పటికే ముఫై అయిదుఏళ్ళు.

లలి—కాబట్టే బజారులో ఒక చీర ఏరుకోమన్నట్లు మొగుణ్ణీ ఏరుకోమంటున్నారు.

సుధా—పోనీ లే! ఇష్టంలేని చీరెకట్టుకునేదానిలా ఇష్టం లేకపోయినా, రఘూని పెళ్ళాడటానికి సిద్ధపడ్డావుగా?

లలి—ఇష్టానికి మించిన కారణాలు తలవచితే ఏంచెయ్యను?

సుధా—అయితే మరిందాక అతన్ని అట్లా తూలనాడావేం?

లలి—తూలనాడాను; అన్ని సంగతులూ అతనికి తెలుసు. తెలిసే నన్ను తృణీకరించిన తర్వాత బ్రతిమాలి ఏం లాభం?

సుధా—అందుకని నువ్వే తెగతెంపులు చేసుకుంటావా?

లలి—జీవితాన్నే తెంచుకోటానికి సిద్ధపడ్డాను. ఇక ఏం తెంచుకుంటే ఏం నష్టం? (వెళ్ళబోతుంది)

సుధా—లలితా! లలితా!........

లలి—నే వెళ్ళొస్తాను.

సుధా—ఆగు.

లలి—ఎందుకూ?

సుధా—ఇదేమిటో చెప్పి వెళుదువుగాని...

లలి—ఏమిటది? (సుధాకరం Photo జేబులోంచి తీసి చేతికివ్వగా) ఇదా!! ఇది మీ దగ్గరకెట్లా వచ్చింది.

సుధా—దొరికింది.

లలి—దొరికిందా!! అరే!

సుధా—ఏం...ఏమిటూ ఖంగారు?

లలి—ఏం లేదు! ఏమో! ఈ Photo సంగతి నాకేం తెలుసు? నాకేం తెలియదు.

[అంటూ Photo పారేసి గబగబా వెళ్ళిపోయింది. సుధాకరం దాన్ని తన జేబులో పెట్టాడు. కాసేపైనతర్వాత సుందరరామయ్యగారొస్తారు.]

సుంద—ఏమిటీ మీరింతసేపూ ఒంటెరిగా నే ఉన్నారా?

సుధా—లేదనుకోండి మీరు ఉత్తరం Post లో పడేసొచ్చారా?

సుంద—ఆ! ఆ! వేసివచ్చా

సుధా—ఏదో అర్జంటు ఉత్తరం లాగుంది.

సుంద—అర్జంటు ఉత్తరమే! నేను నిన్న బెజవాడ వెళ్ళాల్సింది; కాని పనివల్ల ఆగిపోయా; రావటం లేదని, నిన్న Wire ఇచ్చా. ఇవ్వాళ విశదంగా Express ఉత్తరం వ్రాశా. రేపన్నా అక్కడికి వెళ్ళితీరాలి.

సుధా—రేపా! రేపు మీరు వెత్తే ఎల్లా! రేపు మన నాటకంలో మూడవరంగం.

సుంద—(నవ్వి) ఆ రంగంలో నా పాత్ర లేకపోయినా ఫర్వాలేదనుకుంటా?

సుధా—అమ్మమ్మా! Climax sceneలో మీరు లేకపోతే ఎలా?

సుంద—మా ముసలిపాత్రలు వీటిల్లో లేకపోతేమాత్రం ఏం లెద్దురూ?

సుధా——అదే మీ ముసలి పాత్రలతో వచ్చిన తికమక.
Hero లాగా ముందు నిలబడకుండానే నాటకం Climax కి
నడుపుతారు. నాటకం నడుపుతూనే ఉంటారు. తాము
చూస్తూనే ఉంటారు.

సుంద——ఆ... మా దేముడిలెండి!

సుధా——ఏం లేదూ?... సరే!!! దీంట్లో ఏముందో ఉంది
చూడండి. (Photo తీసి చూపిస్తాడు.)

సుంద——ఇదా? ఇదెక్కడనించి తీశారూ?

సుధా——మీ Drawer లోంచే లెండి. ఎవరీ అబ్బాయ్?

సుంద——(ఖంగారుపడ్తూ) మావాడే లెండి...అదే...ఎరు
గున్నవాడే. అంటే - ఏం లేదు! అంతా తిర్వాత తీరి
కగా చెప్తాలెండి. ఇప్పుడు కాదు; ఇంకా చాలా పనుంది;
నే చెప్తానన్నాగా తరువాత.

సుధా——సరే.

సుంద——ఆ - మళ్ళా - ఆ Photo ఇట్లా ఇచ్చేస్తారా?

సుధా——ఏం - అర్జంటుగా కావాలా?

సుంద——ఆ! కావాలి, కావాలి. అదక్కడ మర్చిపోయాను.
పొరపాటున, ఇవ్వండి -

సుధా——మీరు చాలా గొప్పనటకులండీ!

సుంద——అబ్బా - నన్నేడిపించకండీ, ఇవ్వండి.

సుధా——తీసుకోండి (Photo ఇచ్చేస్తాడు)

[రఘూ ప్రవేశం]

రఘు——మీరింకా ఇక్కడే ఉన్నారే?

సుధా—ఏం? నీకేమన్నా అడ్డమా నేను?
రఘు—ఛా - ఛా! అదికాదు. ఊరికేనే అన్నాను. లలిత లోపలుందా?
సుధా—ఉంది.
సుంద—నే వస్తానండీ - సుధాకరంగారూ; కాని - (సంకోచపడుతూ కంటాడు)
సుధా—కాని...?
సుంద—ఏం లేదు; ఈ సంగతి ఎవ్వరితోనూ అనకండి.
సుధా—అదా! అల్లాగే...
సుంద—ఆ - వస్తా (వెళతాడు)
రఘు—నేనూ లలితతో మాట్లాడి వస్తా.
సుధా—ఆగు. ఒక్క సంగతి చెప్పి వెళ్ళు.
రఘు—ఏమిటండీ! ఎప్పుడూ ఏదో ఒక Cross పరీక్ష!
సుధా—ఏం. లేదు (రహస్యంగా చెవిలో) సుందర్రామయ్య గారి దగ్గర Photo ఒకటుంది. ఎవరిది? నీకు తెలుసా?
రఘు—ఒక కు...ర్రా...డి...
సుధా—ఆ కుర్రాడి Photo దాని సంగతి నీకు తెలుసా? (రఘు మాట్లాడడు) తెల్సా - తెలియదా? తెలియదూ?
రఘు—పైకి దువ్విన క్రాఫింగుందా...?
సుధా—ఆ - అదే! తెలుసన్న మాట!!
రఘు—(ఖంగారు పడిపోతూ) అహా! నాకేం తెలియదు. అవంతా నన్నడక్కండి; వస్తా.

సుధా—వద్దువుగాని; కానీ - ఆగు - నువ్వెళ్ళి లలితతో మాట్లాడినా - లలిత నీతో మాట్లాడదు.

రఘు—మాట్లాడక ఎక్కడికి పోతుంది; ఎన్ని మాటలనుకున్నా మాట్లాడక తప్పదు.

సుధా—ఇక ఎక్కువ మాట్లాడక్కర్లేదులే, లలితను నేను పెళ్ళి చేసుకోబోతున్నాను.

రఘు—మీరా! (తెల్లబోతాడు)

సుధా—ఆ! నేనే! (దూరంగా వెళ్ళి మంచినీళ్ళు తెచ్చి యిచ్చి) మంచినీళ్ళు త్రాగుతావా? (అని ఇవ్వబోతాడు రఘు తీసుకోడు మంచినీళ్ళగ్లాసు చేతిలో వుంచుకునే సుధాకరం మాట్లాడుతుంటాడు)

రఘు—అక్కర్లే, కాని మీరు పెళ్ళి చేసుకోవటమేమిటి?

సుధా—ఏం పెళ్ళిచేసుకోకూడదా? వయస్సు ముదిరిందనా

రఘు—అబ్బే అదికాదు; కానీ......ఎట్లా...ఎల్లా పెళ్లి చేసుకుంటారా అని......?

సుధా—ఎల్లాగేముంది? అందరిలాగే!

రఘు—అందరిలాగే అయితే ఆశ్చర్యమేముందీ! కాని... కాని లలిత......

సుధా—ఆ-! లలిత......

రఘు—లలిత - ఇప్పుడు - గర్భిణీ!

సుధా—(ఆశ్చర్యంతో బిగ్గరగా) ఆ! గర్భిణీయా?

రఘు—అబ్బ -అరవకండి, ఎవరన్నా వింటారు...అందువల్లే- నేకాదన్నా, లలితకాదన్నా, పెళ్ళి తప్పదు.

సుధా — అయితే?

రఘు—ఇందాక లలితన్న మాటలకి చాలా కోపంవచ్చింది. వెళ్ళిపోదామనుకున్నా. కానీ...నాపిల్లనో. పిల్లవాణ్ణో ఒదలి ఎల్లావెళ్ళను?

సుధా—(మంచినీళ్లు గబగబా తాగుతాడు)

రఘు—కోపంతో లలిత మిమ్మల్ని పెళ్ళిచేసుకుంటా ననేసింది కాబోలు. లేకపోతే ఎట్లాఅంటుంది? కోపంలో అంటే, నిజమేననుకున్నారు-మీారు. నిజమేనా? అంతేనా? చెప్పరేం?

సుధా — కాదు.

రఘు—కాదూ? దబాయించకండి; నేనమ్మను.

సుధా—లలిత నన్ను చేసుకుంటానన లేదు; నేనే చేసుకుంటుం దనుకున్నాను.

రఘు—అదా! అంతేగదా (నవ్వి) అయితే ఇక నేం భగ్న హృదయుం అని నాటకం వ్రాసేయండి. కథావస్తువు దొరికిందిగా! రక్తిగానే ఉంటుంది. త్వరగా వ్రాసెయ్యండి; కానీ ... ... (అకస్మాత్తుగా తరహామార్చేసి) ఇవ్వి చేతులుకావు; కాళ్ళు; ఈరహస్యం ఎవ్వరితోనూ చెప్ప కండి.

సుధా—చెప్పన్లే.

రఘు—ఇందాక ఊరికే తమాషాగా అన్నాను; ఈసన్ని వేశం నాటకంలోకూడా ఎక్కడా పెట్టకండేం?

సుధా—సరే.

రఘు—'సరే' ... అంటే కాదు; మీరూ.....ప్రమాణం చెయ్యాలి.

సుధా—సరేలే.

(మూర్తి గబగబా వస్తాడు)

మూర్తి—ఏమిటండీ? డాక్టర్ గారు అట్లా అన్నారేం?

సుధా—ఏమన్నారూ?

మూర్తి—ఏమనాలి ఇంతకంటే!......

(అని కోపంగా చెప్పబోయి రఘువంక చూసి ఆగాడు)

సుధా—రఘూ! నువ్వు లలితతో మాట్లాడాలన్నావ్?

రఘు—ఇదిగో వెళుతున్నా. (వెళతాడు)

సుధా—ఏమిటీ సంగతి?

మూర్తి—శారదను డాక్టర్ కిచ్చే ప్రమేయమే వాళ్ళింట్లో రాలేదట!

సుధా—అలాగా! వాళ్ళింటికి నువ్వు వెళ్ళావా?

మూర్తి—లేదు. వాళ్ళడ్రైవర్ కనిపిస్తే వాడికి కాఫీపో యించి-కబుర్లలో కనుక్కున్నా-వెధవ; పన్నెండణాలకు తిన్నాడు. ఈ డాక్టర్ గారి అబద్ధంవల్ల నాకు పన్నెం డణాలు ఖర్చు.

సుధా—(చిరునవ్వు నవ్వి) సరేలే డాక్టర్ని బెదరిస్తూ ఇంకో చీటీ రాయి.

మూర్తి—ఆరి భగవంతుడా! అది మీకెలా తెలుసూ!

సుధా—నాకు అనవసరపు విషయాలు - అవసరమైన విషయాలకంటే ఎక్కువ తెలుసు; కాని నువ్వు డాక్టరును అనవసరంగా గాభరా పెట్టావ్.

మూర్తి—నేను రాశానని డాక్టర్ గారితో చెప్పకండేం?

సుధా—సరేలే.

మూర్తి—ఈసంగతెక్కడా నోరుజారకండి!

సుధా—ఆ! అల్లాగే.

మూర్తి—ఏ కథలోకూడా కలం జార్చవద్దు, అదీ నా అసలు భయం -

సుధా—సరే - కానీ - ఒక సంగతి నువ్వు చెప్పాలి.

మూర్తి—ఏమిటది ?

సుధా—మీ నాన్న దగ్గర ఒక Photo ఉంది.

మూర్తి—అదా! ఒక కుర్రా......

సుధా—ఆ కుర్రాడిదే! ఎవరా కుర్రాడు ?

మూర్తి—అదోగాథ. అహా! నన్నడక్కండి! నే చెప్ప గల్గింది కాదు. నే వస్తా. డాక్టరు దగ్గర కెళ్ళాలి.

సుధా—డాక్టర్ దగ్గర కెందుకూ ?

మూర్తి—వెళ్ళి కనుక్కుంటాను - ఈ అబద్ధా లెందుకు కాడానో ?

సుధా—అదా! మరి వారిప్పుడింట్లో ఉండరేమో! V sits కి వెళ్ళే సమయంగా ?

మూర్తి—ఇంటికి వచ్చేదాకా అక్కడే ఉండి, సంగతి కనుక్కు వస్తా - లేకపోతే ఏమిటండీ? ఉత్తపుణ్యానికి ఎందుకండీ కల్పించడం!

సుధా—సరే - అలాగే! వెళ్ళి కనుక్కో - కానీ- శారదతో పెళ్ళి వ్యవహారమంతా నీ కనుకూలం చేస్తే, నాకేం బహుమతిస్తావ్.

మూర్తి- అనుకూలంగా మారుస్తారా ?

సుధా—ఆ! పెళ్ళి సన్నివేశాన్ని అనుకూలంగా మారిస్తే - నాకూ ఏం...

మూర్తి—ఆజన్మాంతం మీకు ఋణపడి ఉంటాను.

సుధా—అది డబ్బు ఖర్చులేని పనిగనక, అంత తేలిగ్గా అన్నాన్ !

మూర్తి—మీకేం బహుమతీ కావాలో చెప్పండి. అదే ఇస్తాను.

సుధా—సరే, ఆ కుర్రాడెవరు ?

మూర్తి—అహ! చెప్తాను. కాని ఇప్పుడు కాదు; రాత్రి తొమ్మిదీ పదిగంటల మధ్య మీ ఇంటికి వచ్చి చెప్తాను.

సుధా—సరే అల్లాగే, నువ్వు వెళ్ళు; వీలుగా ఉంటే డాక్టరు గారి దగ్గర కెళ్ళు.

[మూర్తి వెళ్ళిపోతాడు; సుందర్రామయ్యగారొస్తారు]

సుంద—సుధాకరంగారూ !

సుధా—ఏం Suspense లో నడుపుతున్నారండీ నాటకం ?

సుంద—ఏమల్లా అన్నారూ ?

సుధా—అదే - ఆ Photo లో కుర్రాణ్ణి......

సుంద—ఆ! ఆ సంగతే మాట్లాడదామని వచ్చాను; చూశారూ; ఆ Photo గురించి చెప్పటానికి చాలాఉంది.

అంతా తర్వాత నిమ్మదిగా చెప్తాను. కాని – ఇవి చేతులు కావు. కాళ్ళు ఈ సంగతి ఎవ్వరితోనూ ఎక్కడా అనకండి.

సుధా—అల్లాగే.

సుంద—ఆ Photo సంగతి మూర్తికీ, లలితకీ అసలు తెలియ నివ్వద్దు. ఇంతవరకూ ఆ రహస్యం వాళ్ళకు తెలియ కుండా దాచాను.

సుధా—వాళ్ళకే తెలియదూ!

సుంద—తెలియదు. వాళ్ళతోకూడా అనకండి; తర్వాత సమయం చూసుకుని నేనే అందరితో చెప్తాను.

సుధా—అల్లాగే.

సుంద—అంతేకాదు! నాటకంలోగూడా ఎక్కడా......

సుధా—పెట్టను.

సుంద—రక్షించారు, ఆ, అది సరే! లోపల రఘూ – లలితా ఏదో ఘర్షణ పడుతున్నారేమిటీ ?

సుధా—పెళ్ళిగోడవేమో!

సుంద—రఘూ ఏవేవో చెప్తున్నాడు; లలిత నమ్మను పొమ్మంటుంది. ప్రేమ ఉంటే మాటలమీద నమ్మకం ఉండదండీ,

సుధా—ఇది నమ్మకంలేని ప్రేమకాబోలు.

సుంద—ఇల్లాగే ఉంటాా. యీరోజుల్లో ప్రేమలు; అరె! లలిత, రఘు వస్తున్నట్లున్నారు! ఆ – నేను – అటు

బజారు వెళ్ళివస్తాను. "బజారు వెళ్తున్నా"నని లలితతో చెప్పి ఇటు వచ్చాలెండి. అది వచ్చేటప్పటికి; ఇక్కడ ఉంటే ఏమన్నా అనుకుంటుంది. అందుకని అట్లా వెళ్ళొస్తాను.

సుధా—సరే. (సుందర్రామయ్య వెళతాడు)

[సుధాకరం లోపలికి చూస్తుంటాడు, రఘు కేకలేసుకుంటూ వస్తాడు]

రఘు—రా! రావేం - మరి. వీరినే కనుక్కుందాం రా!

లలి—(ప్రవేశిస్తూ) వస్తాను, నాకేం భయమా?

రఘు—దీంట్లో సబబేమిటో మీరే చెప్పండి. నన్నూ పెళ్ళి చేసుకున్నా, నమ్మదట.

లలి—నమ్మేదెట్లా! చేతలు అవకతవకగా ఉంటే! ఆ డాక్టర్ గారి చెల్లెల్ని చేసుకుంటాననీ.........

రఘు—నే ననలేదు, మొగ్రో అంటే వినవే?

లలి—నువ్వనకపోతే - మీఅన్న అన్నాడేమో!

రఘు—మాఅన్నా అనలే; నాకు తెలీకుండా మాఅన్న ఎందుకంటాడు?

లలి—నీకు తెలిసేదేమిటి...మీఅన్న వెనక ఉండేవాడివి,...

రఘు—అదిగో మళ్ళీ; నన్ను విసిగించకు; ఆ డాక్టగొంకడూ—వెధవఅబద్ధాలు,

లలి—అందరివీ అబద్ధాలే - ఇందులో తక్కువ తిన్నవారెవరూ లేరు.

సుధా—ఆగం డాగండి. మీరు నాకసలుసంగతి చెప్పకుండా దెబ్బలాడుకుంటున్నా రేమిటి?

రఘు—నన్ను పెళ్ళిచేసుకుంటుందటండీ; కానీ అందాక నే నెక్కడికీ వెళ్ళకుండా ఇక్కడే కూర్చోవాలిట. పెళ్ళయితే నాకూ యిష్టమేగాని, ఇల్లరికముండమంటే ఎట్లా?

లలి—ఇల్లరిక ముంటే ఉండనివ్వటానికి ఇక్కడెవరూకూర్చో లేదు.

సుధా—నువ్వున్నావుగా?

లలి—నే నుండనిస్తే సరా! మూర్తి ఉండనివ్వద్దూ?

సుధా—మూర్తి వప్పుకోడంటావా?

లలి—వాడి కేంపట్టింది?

సుధా—అయితే ఒకపని చెయ్యండి మీరిద్దరూ. మాయింటికి రండి. పెళ్ళయిందాకా మీ ఇద్దర్నీ మాయింట్లో నే నుంచుకుంటాను.

రఘు—ఎవరైనా నన్నుంచుకోవట మేమిటండీ ఖర్మం?

లలి—ఇష్టంలేకపోతే మా నెయ్యి – నిన్నెవరూ బలవంత పెట్టలా!

రఘు—ఇష్టంలేదని నేనెప్పుడైనా అన్నానా.

లలి—వేరే అనాలా "మాఅన్న ఒప్పుకోవాలీ, మా అమ్మ ఒప్పుకోవాలి," అని రోజులు గడపటం చాలదూ?

రఘు—కాని ఆగోల. నేను చూచుకుంటున్నానుగా! మీ నాన్నగార్ని వప్పించటానికి నువ్వేం చేశావ్?

లలి—మానాన్నగార్ని వప్పించమంటే ఇప్పుడొప్పిస్తాను. కానీ ఆస్తంతా వ్రాయించుకురమ్మంటే లాభంలేదు.

రఘు—ఆస్తంతా వ్రాయించుకురమ్మని నేనన్నానా? ఏదో సాధ్యమైనంతవరకూ చూడమన్నానుగాని.

లలి—చూసేదిలేదూ—పెట్టేదిలేదూ. ఆ ఆశలన్నీ పెట్టుకోకు; నాన్నగారు దమ్మిడీ యివ్వరు.

రఘు—ఆయ నివ్వనంటే సరే! ఎవ్వరూ చేసేదేమీలేదు. కాని ఆయన్ని నువ్వడిగావా?

లలి—అడగక్కరలేదు. నాకు తెలుసు.

రఘు—అడగందే ఎట్లా తెలుస్తుంది? మాఅన్నయ్యతో దెబ్బలాడి నే నొచ్చేస్తే - మీనాన్నా ఏమీ యివ్వకపోతే, మరునాటినుంచీ ఏంతింటాం? కాస్త వుద్యోగం సంపాదించే దాకానన్నా తినాలిగా.

లలి—తింటే తింటాం - లేకపోతే లేదు;

రఘు—అంతకంటే మూర్ఖం ఉందా!

లలి—అంతకంటే మూర్ఖులమే మనం. సుధాకరంగారూ! రాత్రి తొమ్మిదీ పదిగంటలమధ్య మీయింటికి వస్తాను; ఏదో సినిమా మిషమీద వస్తాలెండి; మీరింట్లోనే ఉండండి. మీతో కొంచెం మాట్లాడాలి, ఇదీ ఆ Photo సంగతీకూడా చెప్తాను,

(లలితలోపలికి వెళ్ళబోగా రఘూకూడా వెంబడిస్తాడు. లలిత వెనక్కు తిరిగి చూచి)

లలి—ఎందుకు? నా వెంట రానక్కర్లేదు లే; అంతా ఆలోచించుకుని వచ్చి – చెప్పు. అంతవరకూ రానక్కర్లే. (వెళుతుంది)

రఘు—(నొచ్చుకుని) సుధాకరంగారూ! మాటపట్టించుకోని వాళ్ళుగూడా మనుషులేనా? మీరు నాటకరచయితలు; ఈసన్నివేశాన్ని మార్చేద్దురూ?

సుధా—అల్లాగే మార్చేస్తాను. కానీ రాత్రివరకూ ఓపికగా లలిత వెంబడే ఉండి, ఏదీపెడితే అది తిని – ఏమంటే అది పడి – తొమ్మిదిగంటలకి లలితతో మాయింటికి రా – నే సరిపుచ్చుతాను.

రఘు—ఎట్లా! మేం రెండు నెల్లనించీ తేలక చస్తున్నాం గదా...!

సుధా—అదంతా అడక్కు! ముందే తెలిస్తే రక్తిగా ఉండదు. నువ్వు లోపలికి పో.

రఘు—రక్తిగా ఇప్పుడేఉంది; ఈ డాక్టర్ ఒకడు; అనవసరంగా గలభా లేవదీశాడు. సరే వస్తాను.

(అంటూ లోపలికి వెళతాడు)

సుధా—ఇక నేనూవస్తాలే; రాత్రి ఏర్పాట్లు చాలావున్నాయి.

[బయటికి వెళ్ళబోతుండగా – డాక్టరుగారు ప్రవేశం]

డాక్టర్—ఏం! నాటకరచయితగారూ! కొంపమునిగింది.

సుధా—ఏంజరిగిందేం?

డాక్టరు—ఆ శారద వాళ్ళింట్లో కన్పించలేదట,

సుధా—అంతేగదా!

డాక్టర్—ఇంట్లో కన్పించలేదట...ఊళ్ళో కన్పించలేదట; శారదా, కారుడ్రైవరూ, కామా, కన్పించలేదట; ఆగండి; మూర్తికి చెప్దామని వచ్చాను.

సుధా—ఆగండి. మూర్తి ఇంట్లో లేడు?

డాక్టర్—మూర్తి లేడూ!

సుధా—మూర్తి లేకపోతే మునిగిపోయింది లేదు; రఘూ ఉన్నాడు

డాక్టర్—ఆ!

సుధా—అతనిప్పుడు మిమ్మల్ని చూస్తే నాటక మిప్పుడే Climax కి పోతుంది.

డాక్టర్—రానివ్వండి. నాకేం భయం?

సుధా—భయం మీకెక్కాదండీ! నాకు! నా మాట విని – పోదాంరండి; రాత్రి తొమ్మిదీ పదీ గంటలమధ్య మా ఇంట్లో మూడవ సీను. రండి త్వరగా పోదాం – అంతా తర్వాత తెలుస్తుంది.

డాక్టర్—పదండి,

[ఇద్దరూ పోబోతుండగా కుర్రాడొస్తాడు]

కుర్ర—సుందర్రామయ్య గారున్నారాండీ?

సుధా—(తెల్లబోయి అతనికేసి చూస్తూ) ఆ!

కుర్రా—ఉన్నారాండీ? సుందర్రామయ్యగారు?

సుధా—ఆ...(నీళ్ళు నములుతాడు)

కు|రా—మీకు చెముడా ఏమిటండీ? సుంద|రామయ్యగారు-సుంద|రామయ్యగారున్నారా ?

సుధా—హుష్ ! అరవకు; నువ్వు...నువ్వా... Photo లో కు|రాడివి కాదూ !

కు|రా—ఏ Photo ?

సుధా—మీ దేవ్రారు ?

కు|రా—నాదా ! బెజవాడ.

సుధా—ఎవర బ్బాయివి నువ్వూ ?

కు|ర— తెలియదు.

డాక్టర్ — తెలీదూ ! !

కు|రా— తెలియదు. మా అమ్మా తెలియదు; నాన్నా తెలియదు. నాకు నే తప్ప మరెవ్వరూ తెలియదు. సరేనా ? విసిగించకండి; సుంద|రామయ్యగా రున్నారో - లేదో - చెప్పండి.

సుధా—తొందర పడకబ్బాయ్; నేనూ నీకోసమేచూస్తున్నా. అనుకోకుండా నువ్వే కనిపించేటప్పటికి, ఖంగారువడ్డాను. అయితే సుంద|రామయ్యగారు నిన్ను రమ్మని రాశారా?

కు|రా—కాదు. రావద్దని రాశారు. అందుకే వచ్చాను.

సుధా—రావద్దని రాస్తే ఎందుకొచ్చావ్ ?

కు|రా—అలా ఎందుకు రాశారో ? కనుక్కోటానికే - లేకపోతే ఎన్నాళ్ళీబాధ ?

సుధా—కోప్పడకు, సుందర్రామయ్యగార్ని కల్సుకోడాని కిది సమయం కాదు; నువ్వు నాతోరా; అన్ని సంగతులూ నే చెప్తా.

సుం|రా.—నే రాను; వారిని నేను కల్సుకోవాలి.

సుధా—వారిక్కడ లేరు. నీకూ వారికీ అనుకూలంగా ఉంటుందిగా - రా - రండి డాక్టరుగారూ; రా అమ్మా! మరేం ఫర్వాలేదు! రా.

డాక్టర్—వస్తా సరే. ఏమిటీ గోల?

సుధా—అంతా తెలుస్తుంది రండి! రాత్రి తొమ్మిది పది గంటలమధ్య మూడవసీన్; ఆఖరిసీను గూడానూ; మీరు కాస్త త్వరగా రండి. మర్చిపోకండి; పదండి. (వెళతారు)

:— తెర :—

---

# మూడవ రంగము

[సుధాకరం ఇంటి మధ్య సావడి, రంగస్థలానికి రెండు ప్రక్కలా రెండు ద్వారాలున్నాయి. వాటికి నటకుల వీలుకోసం ఒకటి రెండు నెంబర్లు ఇద్దాం. వెనక గోడలో మరో రెండు ద్వారాలున్నాయ్ వాటికి మూడూ నాలుగూ నెంబర్లు యిద్దాం. రంగంమీద చిన్న Teapoy; దాని చుట్టూ మూడు కుర్చీలు ఉన్నాయి; సుధాకరం, Doctor – కూర్చుని మాట్లాడుతున్నారు. గోడ నున్న గడియారం తొమ్మిది గంటలు కొట్టింది.]

డాక్టర్—తొమ్మిది గంటలయింది.

సుధా—అయింది.

డాక్టర్—ఇంకా మీ నాటకానికి First Bell కూడా కొట్ట లేదు.

సుధా—నాటకం కాదండీ? అన్ని పాత్రలూ తయారయ్యే సరికి – ఆలస్యం అవుతుంది.

డాక్టర్—ఏదీ! పాత్రల సందడన్నా లేందే!

సుధా—తయారవుతాయి; తొందర పడకండి; అన్ని ఏర్పాట్లూ చేశాను. ఇంక తెర ఎత్తటమే తరువాయి,

డాక్టర్—బాగానే ఉంది; కానీ ఈ అపూర్వమైన నాటకం సంగతలా ఉంచండి; మీ రసలు నాటకాలు ఎల్లా వ్రాస్తారూ?

సుధా—ఎల్లా అంటే ?

డాక్టర్—అదే! ఎట్లా ప్రారంభం చేస్తారూ? ఎల్లా నడుపుతారు ?

సుధా—ఎల్లా ఏముందీ! కొన్ని పాత్రల నూహిస్తాను; వాళ్ళ మానసిక ప్రవృత్తులు నిశ్చయిస్తాను. తర్వాత ఎక్కడో అక్కడ కథ ప్రారంభిస్తాను; వ్రాసేస్తాను.

డాక్టర్—మరి కథ!!

సుధా—కథ దానంతట అదే వస్తుంది.

డాక్టర్—దానంతటది ఎల్లా వస్తుంది ?

సుధా—(వాకిలి వంక చూస్తూ) చూద్దురు గాని, నేటి రాత్రి నాటకంలో రంగం ప్రారంభ మవబోతోంది... తెర...(తెరవంకచూసి) తెర లేచిందనుకోండి మీరు లేవండి; ఆ గదిలోకి వెళ్ళి కూర్చోండి. (మూసో ద్వారం చూపిస్తాడు.)

సుధా—సుందర్రామయ్యగారొస్తున్నట్లున్నారు! రిక్షా ఆగింది. మీరు లోపలికెళ్ళి కథంతా చూస్తూండండి, తలుపు కాస్త దగ్గర వేసుకోండి.

డాక్టర్—ఆ గదిలో దాక్కోమంటూరా ?

సుధా—అదే; ముసుగూ గిసుగూ వేసుకోనక్కర లేదు; త్వరగా వారొచ్చేటప్పటికి నేను కూర్చుని ప్రవేశించాలి.

డాక్టర్—అల్లాగే కానీయండి. (అని లోపలికి వెళతాడు)

[సుధాకరం కూర్చుంటాడు. సుందర్రామయ్య ప్రవేశం]

సుధా—మీరొస్తారనే ఇంతసేపూ కాచుక్కూర్చున్నాను. రండి, దయచేయండి (అని కుర్చీ చూపగా సుందర రామయ్య కూర్చుంటాడు)

సుంద—అహహ. (నవ్వి) నేనూ త్వరగా వెళ్లాలి; మళ్ళీ మూర్తివాళ్ళూ ఎక్కడికి వెళ్ళానని అడిగితే - ఏదో అబద్ధం ఆడాల్సి వస్తుంది. మీకు చెప్పాల్సిందల్లా ఒక్కటే; Photo లో ఉన్న కుర్రవాడున్నాడే వాడికి నా ఆస్థంతా రాసేశాను.

సుధా—అంతానా! అంతా వ్రాసేశారా!!!

సుంద—ఆ, అంతా.

సుధా—నేను కొంతే అనుకున్నానులెండి.

సుంద—కొంతే అనుకున్నారా! అయితే సన్నివేశం కొంత వరకూ అర్థమైనట్లుంది మీకు; ఆ కుర్రాణ్ణి చిన్నప్పట్నించీ నేనే పెంచుతున్నాలెండి.

సుధా—మరి ఆ కుర్రాడు!

సుంద—మీకు ఆశ్చర్యంగా ఉందా - అతనెవరోనని? ఆశ్చర్యపడితే పడండి; కాని నేనీనాడు, ఇల్లా ప్రపంచంలో "ఒకమనిషిగా" తిరగగల్గుతున్నానంటే. దానికి ఆ కుర్రాడి తల్లి కారణం. ఆమె ఆస్తి కారణం. ఆమె చచ్చిపోయింది. ఆకుర్రాణ్ణి బెజవాడలో ఉంచి నేనే ఇన్నాళ్ళూ పెంచుతున్నాను. ఇదంతా చాలా రహస్యమనుకోండి. ఎవ్వారికీ మూర్తికీ - లలితకీ - కూడా తెలి

యదు. కాని ఈ మధ్యనే వీళ్ళిద్దరికీ ఈసంగతి తెల్సిందా అని అనుమానంగా ఉంది.

సుధా—అహా!

సుంద—సంగతంతా తెలియదేమోగాని, కొంతవరకూ తెల్సి నట్టుంది. నేను రహస్యంగా విల్లు వ్రాసిపెట్టిన తరువాత, రెండు మూడు రోజులనుంచే వీళ్ళల్లో ఈమార్పు చూస్తు న్నాను. అందువల్ల......

సుధా—తెల్సిందో, తెలియలేదో. తెల్సుకోటానికే నన్ను నియోగించారు. కాని దీంట్లో సందేహమేముంది? వాళ్ళిద్దరికీ ఈ సంగతి తెల్సిపోయింది; ఆస్తంతా వ్రాశా రనికూడా తెల్సిపోయింది. కనకనే మీకు దొంగకదుపు నొప్పి వచ్చినప్పుడు, ఆ విల్లు చెల్లాలని కోరారు.

సుంద—ఆ! అదీ సన్నివేశం: ఇక ఎల్లాగన్నా మీరీ సన్ని వేశాన్ని మన కనుకూలంగా మార్చాలి., అందులో ఎవ్వరికీ కష్టం లేకుండా అందరికీ ఆనందంగా ఉండేటట్టూ...

సుధా—అండే ఆస్తి ఒదులుకున్న లలితా, మూర్తీకూడా ఆనందించాలంటారా?

సుంద—ఈపరిస్థితుల్లో ఆనందించటం కష్టమే ననుకోండి; కాని సన్నివేశాన్ని మనం అనుకూలంగా మార్చుకో గలంగా.

సుధా—ఎల్లాగండీ? రేపు మూర్తికీ సంగతంతా తెలుస్తుంది, ఇక మీరు విల్లు మార్చారనే నిరాశతో, అతను మిమ్మల్ని

ఖూనీ చేస్తాడనుకోండి: అప్పుడు మిమ్మల్ని ఆకర్షించిన మంటే ఆనందించగలరా?

సుంద—ఖూనీలదాకా వెళ్తాడంటారా?

సుధా—ఏమో! అతన్ని చూస్తుంటే ఇటువంటి నిరాశలకి తట్టుకునే రకంగా కన్పించడు! పైగా అగని గోల. ఆ శారదను...—

సుంద—నిజమేకాని - వాడి చదువైపోయింది గనక, ఇక ఇక తానంత తాను సంపాదించుకోగలడు. మీకు తెలి యదుగాని, ఎవ్వరికీ తెలియకుండా వాడు పదివేలు సంపా దించి నిలవేశాడు.

సుధా—ఏం వేసినా - లక్షాధికారై శారదను పెళ్ళిచేసు కోవాలని అతని ఆత్రం. అందుకని, సన్నివేశాన్ని అర్థం చేసుకుని మీరే మారిపోతే మంచిది.

సుంద—నన్ను మార్చటానికి మీ తెలివితేట లెందుకూ? ఈ జన్మలో నేనిదివరకే ఒక తప్పుచేశాను. వాడి ఆ స్థితో నా పొట్ట పోసుకుంటున్నాను. ఇక అలా వీల్లేదు. వాడు పెద్దవాడయ్యాడు. ఈ అస్తి ఆ కుర్రాడిది, వాడికే ఇచ్చేస్తాను.

సుధా—అరెరే! సన్నివేశం మారింది!!!

సుంద—ఏమిటీ?

సుధా—అటు గేటువైపు చూడండి. మూర్తి రిక్షా దిగాడు.

సుంద—ఆ! మూర్తే! ఇక్కడికెందు కొస్తున్నా డిప్పుడూ?

సుధా—ఏమో? ఎట్లా ఇప్పుడూ? మీరు రిక్కడుండటం బాగుంటుందీ?

సుంద—బాగుండదు, ఏం చేద్దాం?

సుధా—(ఆలోచించి) మీరా గదిలోకి...వెళ్తే...

సుంద—ఆ...ఆ...వెళ్తాను; నేనిక్కడున్నానని తెలియ నివ్వకండేం?

సుధా—ఆ! త్వరగా పదండి,

(సుందర్రామయ్య గబగబా రెండో నెం॥ గదిలోకి వెళ్తాడు. మూర్తి బయటనించే 'సుధాకరం గారూ' అని కేకేస్తాడు.)

సుధా—ఆ...రా...(మూర్తి వస్తాడు) రాకూర్చో.

మూర్తి—కూర్చోటానికి రాలేదండీ! వెళ్ళాలి. ఆ Photo చూశారూ? అతనూ – మానాన్నగారు పదిహేనేళ్ళ క్రిందట ఒకామెను, చేరదీశారు; ఆమెకొడుకు.

సుధా—అలాగా!

మూర్తి—దానికి నే నేమనటం లేదు; కాని నాన్నగారు ఆస్తంతా ఆపిల్లాడికి వ్రాసేశారు. విన్నారా? అసలు సం తానం మమ్మల్ని అడుక్కుతినమన్నారు.

సుధా—విల్లు వ్రాసేశారా?

మూర్తి—వ్రాసి రెండు నెలలైంది.

సుధా—నువ్వా విల్లు చదివావా?

మూర్తి—ఆ! ఎల్లానన్నా మనసు మార్చుకుంటాడేమోనని నాప్రయత్నం నేను చేశాకూడా; కాని లాభంలేదనే అనిపిస్తోంది.

సుధా—ఏం?

మూర్తి—ఇవి ఇవ్వాళో రేపో రిజిష్టర్ చేయటానికి బెజవాడ ప్రయాణం అవుతున్నాడు.

సుధా—మరాయన వ్రాసేసినతర్వాత – మనమేం చెయ్య గలం? ఆస్తిఅంతా ఆయన స్వార్జితంకాబోలు?

మూర్తి—అదే! అందుకనే మిమ్మల్ని నన్ని వేళాన్న మార్చేయమని అడుగుతున్నా.

సుధా—మార్చటానికి ప్రయత్నం చేస్తున్నా; . కాని సాగు తుందా అని.?

మూర్తి—సాకపోతే నేనూ తెగిస్తాను; అంతవరకూ వచ్చింతర్వాత ఆయన తండ్రేమిటి? నేను కొడుకునేమిటి? విల్లు రిజష్టర్ కాకముందే – ఇక ఎప్పటికీ కాకుండా చేస్తాను.

సుధా—రామ! రామ!!

మూర్తి—మీ పెద్దకొడుకును చూస్తే నాకిదే వళ్ళుమంట; ఎంత సేపటికీ కుర్రవాళ్ళనోళ్లు మూస్తారుగాని, పెద్దవాళ్ళకు బుద్ధి చెప్పరు. ఎల్లాగైనా మీరే చెప్పండి–విల్లుమార్చమని; లేదా......?

సుధా—లేకపోతే ఏంచేస్తావ్?

మూర్తి—ఏదైనా చేస్తాను.

సుధా—ఏం చేస్తావో! ఆయన ఆగదిలోవున్నాడు.

మూర్తి—ఈ గదిలోనా! నాన్నగారా!

సుధా—ఆ.

మూర్తి—ఈగదిలో ఎందుకున్నారూ?

సుధా—ఒకపనుండి వచ్చాడు.

మూర్తి—అయితే పిలవండి. ఇక ఎవటుపడి అన్ని సంగతులు తేల్చుకుందాం.

సుధా—ఇప్పుడా! ఏం, తొందర?

మూర్తి—తొందరే; రేపో - ఎల్లుండో - ఆవిల్లు రిజష్టర్ అయిపోతుంది. ఆయనసంగతీ, ఆ శారదసంగతీ ఇవ్వాళే తేలిపోవాలి.

(లోపల్నించి "సుధాకరంగారూ సుధాకరంగారూ" అని లలిత - కంఠస్వరం వినిపిస్తుంది)

మూర్తి—ఎవరది! లలితేనా? (ద్వారంవంక చూస్తాడు)

సుధా—ఆ. లలితా - రఘూనూ?

మూర్తి—ఇక్కడికెందుకు వస్తున్నారు?

సుధా—ఏమో! వచ్చి చెప్తేగా తెలిసేది!

మూర్తి—అయితే నేనా గదిలోకి వెళతాను. ఉన్నానని చెప్పకండి (మూడోగదిలోకి వెళ్ళబోగా)

సుధా—కాదు. ఈగదిలోకి వెళ్ళు (నాలుగవద్వారం చూపిస్తాడు)

మూర్తి—సరే......(ఆగదిలోకి వెళతాడు)

(సుధాకరం సర్దుకూర్చుంటాడు. రఘూ లలితా వస్తారు)

లలి—పాపం? మనకోసం కాచుక్కూర్చున్నారులాగుంది?

సుధా—ఆ - ఆ - ఇద్దరూ కలిసేవచ్చారే!

రఘు—కల్సేవచ్చాం: కాని - తిక్క[illegible]
క్కాదులెండి.

సుధా—అయితే సినిమాకని బయలు దేరారన్న మాట-మరి-
ఇద్దరికీ రాజీ అయినట్లేనా?

లలి—ఆ. మేం త్వరగా వెళ్ళాలి; ఆ ఒక్క-మాటా చెప్పి
పోదామనీ - వచ్చాను. ఆ Photo లో కుర్రాడు మా
తమ్ముడు.

సుధా—అలాగా - (పరధ్యానంగా అనేస్తాడు)

లలి—అలాగా అని అంత తేలిగ్గా అంటారేమండీ? మీకేం
ఆశ్చర్యంగా లేదూ?

సుధా—ఆశ్చర్యమా ? ఎందుకూ?

లలి—మాతమ్ముడైతే మాఇంట్లో ఉండొద్దూ! మా అమ్మ
పోయి పదిహేడేండ్లయితే - నాకు పదిహేనేళ్ళ తమ్ము
డెక్కణ్ణించివస్తాడు?

సుధా—(తమాయించుకుని) ఆలెక్కలన్నీ నే వెయ్యలేదు;
తల్లి నువ్వు తమ్ముడంటుంటే - నేకాదంటే, కాకుండా
పోతాడా?

లలి—ఏమో ఎల్లాగైనా కానీయండి; మానాన్నగారు ఆకు
ర్రాడికే ఆస్థిఅంతా రాస్తున్నాడు.

రఘు—ఆస్థి అంతానా?

**లలి—ఆ - అంత ఆస్తీ రాస్తున్నాడు. విల్లు వ్రాయటంకూడా
అయిపోయింది,**

రఘు—మరి మీయిద్దరికో!......

లలి—దమ్మిడీ వ్రాయడు; విల్లు త్వరలోనే రిజిష్టరవుతుంది;

సుధా—ఇదంతా నీకెట్లా తెలిసిందీ?

లలి—ఎల్లాగేమిటి! నాన్నగారి రహస్యమంత్రాంగమంతా
    నేనూ చూస్తూనే ఉన్నా - మొదటినించీ.

సుధా—ఇంతకూ ఆ కుర్రాడెవరూ?

లలి—మా నాన్నగారి మరో భార్య కొడుకు; రెండో పెళ్ళి
    ఎప్పుడయిందో నన్నడక్కండి.

రఘు—అయితే పెళ్ళవలేదంటావా?

లలి—పెళ్ళయితే ఈ గోడవంతా ఎందుకూ?

రఘు—సరే! ఇదొకటా! నేనింకేదో అనుకున్నా.

సుధా—ఏం? అలా తెల్లబోయావేం?

రఘు—ఇప్పటికే మా వాళ్ళందరికీ చెప్పలేకుండా ఉంటే,
    పైన యిదొకటా?

లలి—అయితే ఏమంటావ్?

రఘు—ఈ సంగతి బైటపడితే- ఇంకేమన్నా ఉందా!

లలి—అయితే- ఇది బైటపడితే మన పెళ్ళి కాదంటావా?
    కాకపోతే పోనీ. మరేం ఫర్వాలేదు. నాదోవ నే చూసు
    కుంటాను.

రఘు—మాశారా! మాట మాట్లాడితే సత్యభామ అయి
    పోతుంది! ఎంతసేపటికీ తను చస్తానని బెదరింపే కాని -
    నా చావు ఆలోచించదు.

(సుందర్రామయ్య గదిలోంచి (నంబర్ రెండు) కేకలు వినిపిస్తాయి. మాటలు వణుకుతో వస్తాయి, "ఆగు! ఎవరు నువ్వు? దగ్గరకు రావద్దంటే, ఓఓఓ–" అందరూ అటు చూస్తారు)

లలి—ఏమిటంటి అది? మా నాన్న గొంతు వినిపించింది?

సుధా—ఆ! మీనాన్న గొంతే!

లలి—మా నాన్న లోపలున్నాడా?

సుధా—ఉన్నాడు.

లలి—ఏం చేస్తున్నాడిక్కడ?

సుధా—ఒక మహానాటకంలో పడి కొట్టుకుంటున్నాడు.

లలి—ఏమిటా నాటకం?

సుధా—కాసేపుంటే తెలుస్తుంది - అరే - ఆయనే, వచ్చేస్తున్నట్లున్నారు?

లలి—అయితే మేం వెళ్ళిపోతాం!

సుధా—వద్దు; ఈ గదిలో ఉండండి; సంగతంతా మీకూ తెలుస్తుంది పదండి,... (అంటూ డాక్టరున్న మూడో గదిలోకి పంపుతాడు. తర్వాత సుందర్రామయ్యగారున్న రెండోగది దగ్గర కెళ్ళి సుందర్రామయ్యగారూ! సుందర్రామయ్యగారూ!

సుంద—(గబగబా ప్రవేశించి) ఆ గదిలో Light లేదండీ! గదంతా చీకటి.

సుధా—అయితే ఆ కేక లేమిటండీ! చీకట్లో భయం వేసిందా?

సుంద——భయం కాదు; అక్క చెపగో ఉన్నట్టున్నారు.

సుధా——ఉంటే - మీరు కేకలెయ్యటమెందుకూ?

సుంద——అది కాదండీ! నేను లోపలికెళ్ళి, తలుపు దగ్గరే నుంచుని, మీరూ మూర్తీ మాట్లాడుతూంటే వింటున్నా. ఇంతలో...

సుధా——ఇంతలో?

సుంద——"ఎవరది? అక్కడే నుంచున్నావేం! ఇట్లారా" అని వినిపించింది. "ఎవర్రా ఇది ఇట్లా పలకరిస్తున్నార"ని వెనక్కి తిరిగి చూస్తే - ఎవరో - ఒక స్త్రీ...

సుధా——ఓస్! ఇంతేనా! ఆడదాన్ని చూస్తే అంత భయమెందుకండీ?

సుంద——కాదండీ! తర్వాత ఆమె నన్ను...

సుధా——ఆ! ఏం చేసిందీ! కొట్టలేదుగదా?

సుంద——కొట్టటం కాదండీ! ప్రేమిస్తోంది!

సుధా——(నవ్వుతూ) ఆ! మిమ్మల్నే?

సుంద——ఆ! 'నే వస్తాన'ని మీరే చెప్పారటగా? ప్రొద్దున్నించీ నా కోసం కాచుక్కూర్చుందట; ఇదంతా చూసి, గాభరా పుట్టి - నేను - కేక లేశాను.

సుధా——పాపం! గాభరా పడకండి; ప్రమాదం లేదు; మీరు లోపలికెళ్ళి - ఆ ద్వారం ప్రక్కనే Switch ఉంటుందీ - అది నొక్కి Light వేయండి. ఆమె మిమ్మల్ని చీకట్లో ప్రేమించిందేమో గాని, Light లో ప్రేమించదు. లోపలికి వెళ్ళండి; ఫరవాలేదు.

సుంద—మూర్తి ఏడీ?

సుధా—లలితవస్తేనూ - ఆ గదిలో కూర్చున్నారు.

సుంద—లలిత వచ్చిందా ఇక్కడికి!

సుధా—ఆ, వచ్చింది; ఆ గదిలో ఉంది. (మూడో నంబర్ గదిలోంచి ముగ్గురు మాట్లాడిన గోల వినిపిస్తుంది.)

సుంద—ఏమిటిది?

సుధా—ఏమిటో కనుక్కోవాలి.

(గోల ఇంకా తగ్గలేదు)

సుంద—వాళ్ళు వస్తారేమో! నే నిక్కడుంటే బాగుండదు, అక్కడే ఉంటా; నే నున్నానని చెప్పకండి!

సుధా—ఆ, వెళ్ళండి. వెళ్ళి వెంటనే Light వేసుకోండి.

సుంద—ఆ...ఆ...(వెళతాడు.)

[నెంబరు మూడు గదిలోంచి డాక్టర్, లలిత, రఘూవస్తారు]

డాక్టర్—ఇదేమిటండీ గోల! వీళ్ళిద్దరూ నన్ను పట్టుకున్నారు?

లలి—పట్టుకునే దేమిటండీ! పని వేళా అబద్ధాలు చెప్పి!

రఘు—అందులో కాస్త కూస్త అబద్ధమా? ఈ పాటికి ఆత్మహత్యలు జరిగిపోయేవి!

డాక్టర్—అబద్ధమని ఒప్పుకుంటా; గాని నే ననేది వినిపించు కోరేం?

రఘు—ఇంకా వినిపించుకునే దేమిటీ - విన్నది చాలదూ!

డాక్టర్—చాలదు. అదంతా నా అంతట నేనే చేప్పలేదు!

రఘు—చాల్లెండి! ఎవరో చెప్పమంటే-చెప్తారా ఇట్లాంటివి.

సుధా—ఆగండాగండి; మీరు తర్వాత దెబ్బలాడుకోవచ్చు;
లేదా ఆ గదిలోనే దెబ్బలాడుకోండి; ఊఁ – తొందరగా
గదిలోకి వెళ్ళండి. ఇక్కడుంటే కథ కాస్తా చెడేటట్టుంది.

డాక్టర్—ఇంకనే నా గదిలోకి వెళ్ళను, బాబూ !

సుధా—పోనీ. ఈ గదిలోకి వెళ్ళండి. (నెంబరు నాలుగు గది
చూపిస్తాడు డాక్టరు ఆగదిలోకి వెళ్తాడు.)

సుధా—మీ రిద్దరూ కూడా వెళ్ళండి, తొందరగా.

రఘు—రా! లలితా పోదాం.

లలి—నే రాను; ఇక ఇంటికి వెళ్తాను.

రఘు—అదేమిటే ?

లలి—ఏమిటా? అంతా ఆలోచించుకుని, నువ్వే మా ఇంటికొచ్చి చెప్పు.

రఘు—అనేది కాస్త అర్థమయ్యేట్టు అను.

లలి—నాకో తమ్ముడున్నాడు. ఆసంగతి తెలిస్తే మీవాళ్ళే
మంటారో ?

సుధా—సరేలే; అదంతా తర్వాత ఆలోచించుకుందాం; ఆ
గదిలో మీ నాన్న ఉన్నాడు. ఆయన వింటే బాగుండదు.
గదిలోకెళ్ళండి.

లలి—ఇంతసేపూ ఏం చేస్తున్నా డిక్కడ ?

సుధా—ఒక స్త్రీతో మాట్లాడుతున్నాడు.

లలి—ఒక స్త్రీతోనా ! ఏ స్త్రీతో ?

రఘు—బాగా నే ఉంది.

లలి—బాగానే ఉంటుంది; నీకు సమయానికి మరొక కారణం కూడా దొరికిందిగా ఇక ఇంటికిపో,

(కోపంగా అని. తొందరగా నంబర్ నాలుగో గది లోకి పోబోతుంది. సుధాకరం అటు అడ్డంవెళ్ళి నంబరు మూడు గది, చూపించగా ఆగదిలోకి లలిత వెళ్ళుతుంది.)

రఘు—బాగానే ఉంది. ఇంటికి పోయేటట్లయితే, ఇంతసేపూ ఎందుకుంటాను? (తనూ లలిత వెనకనే వెళ్తాడు)

[మూర్తి డాక్టర్ నెంబరు నాలుగు గదిలోంచి ప్రవేశం]

డాక్టర్—ఇదేమిటండీ! ఇక్కడ ఇంకోగోలా – అనవసరంగా?

మూర్తి—మీ కనవసరంగానే ఉంటుంది; వాక్కడుపు మండి పోతూంది; మీకు పుణ్యముంటుంది; శారద ఏమైందో చెప్పండి?

డాక్టర్—నాకేం తెలుసు.

మూర్తి—వాళ్ళింటికి వెళ్ళారుగా మీరు?

డాక్టర్—అక్కడ లేదని తెల్సుగాని, ఎక్కడుందో నాకేం తెలుసు?

మూర్తి—పబాయించకండి; మీకన్నీ తెలుసు; దొంగవెధవ ఆ Driver చెప్పాడు – పన్నెండు అణాలు తిని.

సుధా—నీకాకావాల్సింది శారద కాదటయ్యా?

మూర్తి—ఆ – శారద కోసమేగా ఈ తిప్పలన్నీ!

సుధా—ఆ గదిలో సుఖంగా వుంది; గాభరా పడకు. (రెండవ గది చూపిస్తాడు)

మూర్తి—ఆ గదిలోనా? ఏం చేస్తుంది?
సుధా—మీ నాన్నగారితో కబుర్లు చెబుతూంది.
మూర్తి—నాన్నగారితోనా! కబుర్లు చెప్పుతూందా?
సుధా—ఆ; మీనాన్నగారితో కబుర్లు చెప్పుతూంది.
మూర్తి—ఏం కబుర్లబ్బా – (గది దగ్గరకు వెళ్ళి విని) నిజమే! శారదే! ఇక్కడికి కెట్లా వచ్చింది?
సుధా—ఎట్లాగో అట్లా వచ్చింది. నువ్వెళ్ళి ఆగదిలో కూర్చో – నేనంతా తెల్సుకుని, తర్వాత – చెబుతాను.
మూర్తి—సరే! అల్లాగే! (వెళ్ళబోతాడు)
సుధా—(డాక్టర్‌తో) మీరూ వెళ్ళండి – గదిలోకి!
డాక్టర్—వెళ్ళను – బాబూ – వెళ్ళను.
సుధా—పోనీ ఈ గదిలోకి వెళ్ళండి. (రెండు నెంబరు గది చూపిస్తాడు)
డాక్టర్—ఆ గదిలోకీ వెళ్ళను.
మూర్తి—వెళ్ళండీ! వెళ్ళి, సంగతులన్నీ – విని చెప్పండి
డాక్టర్—నాకు చేతకాదు – బాబూ – నాకు చేతగాదు.
మూర్తి—ఛ! ఛ! ఎవర్ని చూశినా తంటాలు తెచ్చి పెట్టే వాళ్ళేగాని తీర్చేవాళ్ళొకళ్ళూ, కనిపించరు. (విసుక్కుంటూ నాలుగో నెంబరు గదిలోకి వెళ్తాడు. అతని దగ్గరనుంచి ఒక కత్తి జారి క్రింద పడుతుంది.]
డాక్టర్—(చూసి) ఇదేమిటి?
సుధా—కత్తి!!!

డాక్టర్—ఎందుకిది?

సుధా—ఏమో!!

డాక్టర్—వెళ్ళిఇచ్చిరానా?

సుధా—వద్దులెండి!- మీమీద, అసలే కోపంగా ఉన్నాడు.

డాక్టర్—నిజమే! ఎందుకొచ్చింది?

(రెండవగదిలోంచి సుందర్రామయ్య ప్రవేశం)

సుంద—వీళ్ళందరూ ఇంకా ఇక్కడే ఉన్నారా ఏం?

సుధా—ఉన్నారు.

సుంద—(రహస్యంగా) చూడండీ; ఆ అమ్మాయి శారదే టండీ? మావాడు ఇదవుతున్నాడే! ఆ శారదట! నన్ను... చూసీ—నన్ను చూసీ.

డాక్టర్—ఆ - మిమ్మల్ని చూసి-?

సుంద—మావా డనుకుందిట,......

సుధా—చీకటికాదూ! పొరపాటుపడి ఉంటుంది.

సుంద—ఆ అమ్మాయిని మావాడే దాచిపెట్టాట్టగా... ఇక్కడ?

డాక్టర్—మీవాడా? – మీ మూర్తి!

సుంద—ఆ, అమ్మాయీ, కారుడ్రైవరూ ప్రొద్దున్నించీ ఇక్కడే ఉన్నారట.?

డాక్టర్—మరి మూర్తి నాతో అల్లా దెబ్బలాడాడేం?

సుంద—ఈ గొడవంతా విని - నేనూ కోప్పడటం మొదలెట్టాను. "ఛత్ వీల్లేదు. నాకు తెలియకుండా ఇంతపని చేస్తాడా! ఆగు, వీడిసంగతి చెప్తా" అని కేకలేశా.

సుధా—(నవ్వుతూ) నాటకం మొదలెట్టారు.

సుంద—(ఒప్పుకుంటూ) ఆ! ఆ! (నటిస్తూ) "నిన్నేగనక మావాడు పెళ్ళాడితే—నా ఆస్తి దమ్మిడీకూడా ఇవ్వను." అని బెదరించా.

డాక్టర్—నిజంగానా!!

సుధా—ఆ! ఆ! సన్నివేశం తిరిగిపోయింది; దానికా అమ్మాయి ఏమన్నదో తెలుసా? "లెక్కలేదులెండి; నాకూ బోలెడంత ఆస్తివస్తుంది - నా పుట్టింటినుంచి" అంది. "నీపుట్టింటివారునీకెంత కుఆస్తి ఇస్తారూ"అన్నాను.

డాక్టర్—అబ్బో! చాలాగొడవుందే!

సుంద—దానికేమన్నదో తెల్సా? సుధాకరంగారు మావాళ్ళతో మాట్లాడారు. అన్నీ స్థిరపరిచారు, అంది. ఏం స్థిరపర్చారూ అన్నాను నేను.

సుధా—(నవ్వుతూ) "ఇదంతా మీకనవసరం" అంటుంది.

సుంద—ఆ - ఆ - అదేఅంది. ఇదంతా చూస్తుంటే సన్నివేశాన్నెక్కడో మార్చినట్లున్నారు.

సుధా—మీకే తెలుస్తుందంతా; కాసేపులోపలే - నాటకం నడపండి.

సుంద—ఆ! ఆ! నాటకం రక్తికట్టేటే ఉంది. వస్తా. (వెళతాడు)

సుధా—రక్తికట్టకేం చేస్తుంది? రంగంమీద స్త్రీపాత్ర ఉంటే...

డాక్టర్—ఏమిటీ నాటకం! అందర్నీ అన్నిగదుల్లో పెట్టి?
సుధా—ఏం బాగుండలేదూ?
డాక్టర్—బాగానేఉంది, అయోమయంగాఉంది, అహ - అయోమయంగాఉందో - బాగుందో - తెలియటంలేదు.
సుధా—ఇక చూడండి! అంతా విస్మయంగా ఉంటుంది.
డాక్టర్—అంటే!
సుధా—అంటే అదే! Suspense! (తెరలోకిచూసి) రా, అమ్మా - అబ్బాయ్! లోపలికిరా?

[కుర్రవాడు ప్రవేశిస్తాడు]

కుర్ర—ఏమిటండీ! నన్నిక్కడకు తీసుకొచ్చారూ - ఏం చెప్పరూ?
సుధా—ఒక్క పావుగంట ఓపికపట్టు. అదుగో? ఆగదిలోకి వెళ్ళి కాసేపు కూర్చో; అంతా తెలుస్తుంది.
కుర్ర—మా బాబాయిగారింకా రాలేదేం?
సుధా—వచ్చారు; ఆగదిలో ఉన్నారు. ఆయనతో చెప్పి. నిన్ను పిలుస్తా. నువ్వెళ్ళి ఆగదిలో కూచో.
(మూర్తిఉన్న నాలుగో నంబరు గదిలోకి పంపిస్తాడు)
డాక్టర్—ఏమి టిదంతా?
సుధా—Suspense!
డాక్టర్—అయోమయం -!!
సుధా—చూశావూ? నాటకరచయిత ఏసన్నివేశాన్నీ తేల్చిపారెయ్యకూడదు. ప్రతిసన్నివేశాన్నీ పోషించాలి. రండి.

(రెండు, మూడు, నాల్గు గదుల్లో గోలవినబడుతుంది, సుధాకరం, డాక్టరు రెండవగదిదగ్గర కెళ్ళి వింటారు)

సుధా—శారదా, సుందర్రామయ్యగారూ.

(నాలుగో నంబరు గదిదగ్గరకు వెళ్లారు)

డాక్టర్—మూర్తీ! కుర్రాడూ

(మూడోగదిదగ్గరకు వెళ్తారు)

సుధా—రఘు లలిత. (ఇద్దరూ విడిపోయి, విడి విడిగా అన్ని గదులదగ్గరకు వెళ్లి వింటారు. గోల మరీ ఎక్కువాతుంది)

డాక్టర్—ఏమిటిదీ?

సుధా—Suspense!

డాక్టర్—ఏడ్చినట్టుంది; వాళ్ళేదో ఘర్షణ పడుతున్నట్టున్నారు?

సుధా—కాని కొట్టుకోవటం లేదు.

డాక్టర్—వాళ్ళందరూ కొట్లాడుకునేదాకా రావాలా?

సుధా—వస్తేగాని - నాటకం బాగా వుండదు.

డాక్టర్—బాగానే ఉంది, వాళ్ళందర్నీ బయటికి పిలుస్తా.

(వెళ్ళబోగా)

సుధా—మీరాగండి.

డాక్టర్—ఆగను.

సుధా—తొందరపడకండీ. వాళ్ళల్లో వాళ్ళు ఎంత ఘర్షణ పడినా కొట్లాడుకోరు, కాని బయటికి వచ్చి......

డాక్టర్—బయటికి వచ్చి—...

సుధా—కొడితే మనిద్దర్నీ చావగొడతారు.
డాక్టర్—మనిద్దర్నా !
సుధా—ఆ ! ముఖ్యంగా మిమ్మల్ని.
డాక్టర్—నేనేం చేశాను మధ్య?
సుధా—అన్ని అబద్ధాలు మీరేగా చెప్పింది !
డాక్టర్—మీరేగా చెప్పమన్నదీ ! !
సుధా—నే చెప్పమన్నానని, వాళ్ళకు తెలియదుగా ?
డాక్టర్—అయితే నన్నిరికించి మీరు తప్పుకుంటారాఏమిటి?
సుధా—తప్పుకోక దెబ్బలు తినమంటారా ఏమిటీ ! ప్రతి నాటకంలో ఒక నీతి ఉండాలంటారు - పెద్దలు. ఒకరు చెప్పమన్నారుగదా అని మనం ఏవీ ఎవరితోనూ చెప్ప కూడదు.'' అది యీ నాటకం నీతి.
డాక్టర్—బాగానే ఉంది నీతి! (గోల బాగా ఎక్కు వౌతుంది) ఇక చాలు ఈ నాటకం ! ఈ Climax, కొంప మునగక ముందే నేను కొంపచేరుతాను.

[డాక్టర్ వెళ్ళబోతుండగా నెంబరు మూడు గదిలోంచి రఘూ వచ్చి]

రఘు—ఆగండి డాక్టర్‌గారూ!
డాక్టర్—ఏం ?

[రఘు వెంట లలిత వస్తుంది. రెండో నంబర్ గది లోంచి సుందర్రామయ్య గబగబావచ్చి "సుధాకరంగారూ సుధాకరంగారూ'' అంటాడు. మూర్తి గదిలోంచి, కుర్రాడి

కేకలు "బాబోయ్ చంపేస్తున్నాడు, బాబోయ్ ! తలుపు కదులుతోంది, అదేమిటని అందరూ అదిరిపడి చూస్తారు]

రఘు—ఏమిటండీ అది ?

సుంద—ఎవరున్నారండీ - ఆ గదిలో ?

సుధా—మూర్తి...మీ రెండో అబ్బాయి, 'సుఖదేవ్' ఉన్నారు.

సుంద—ఆ, మావాడా ! మా సుఖదేవ్ !

సుధా—ఆ ! అతనే !

[నెంబరు నాలుగో గది తలుపు తెరుచుకుని కుర్రాడు- 'సుఖదేవ్' గబగబా బయటికి పరుగెత్తుకొస్తాడు]

సుంద—సుఖదేవ్ !

కుర్రా—బాబాయ్ !

సుంద—నువ్వా !

కుర్రా—బాబాయ్ !

సుంద—ఇక్కడికెప్పుడొచ్చావ్ ! అలా కేకలేశావేం ?

సుఖ—ఆ గదిలో ఎవరో అబ్బాయి నా మీదపడి పీక పిసికి చంపబోయ్యాడు !

సుంద—చంపబోయాడా ! కుర్రాణ్ణి పట్టుకుని చంపబోతాడా!
(కోపంగా లోపలికి వెళ్ళాడు)

లలి—నాన్నా !

సుధా, డాక్టర్—సుందర్రామయ్యగారూ !

సుఖ—బాబాయ్ !
లలి—సుధాకరంగారూ ! లోపల మూర్తి కాదండీఉన్నదీ ?
రఘు—వాళ్ళిద్దరూ లోపల కొట్టుకోరుగదా ?
సుధా—కొట్టుకుంటే ఫర్వాలేదు! ఖూనీ దాకా పోకుండా ఉంటే!
రఘు—ఖూనీయా !
సుధా—సుందర్రామయ్యగారు కోపంగా వెళ్ళారు; ఇందాకా మూర్తి ఖూనీ చేసేస్తే మాట్లాడాడు!
లలి—సుధాకరంగారూ! మీరన్నా పోయి ఆపండి.
సుధా—అమ్మో! మూర్తి దగ్గర కత్తి ఉన్నట్టుంది!
సుఖ—ఆగండి! నే వెళ్తా.
డాక్టర్—ఆ! ఆ! వెళ్ళకు. వెళ్ళకు; ఎవ్వరూ వెళ్ళటం మంచిది కాదు.
లలి—రఘూ! నువ్వన్నా వెళ్ళరాదూ ?
రఘు—ఫర్వాలేదు; సుధాకరంగారూ! అందరం ఒక్క-సారిగా వెళ్దాం పదండి.
డాక్టర్—ఆ - వెళ్దాం - పదండి!

(అందరూ కూడ పలుక్కుని ఒక్కసారిగా వెళ్ళబోగా Lights ఆరిపోతాయి. అంతా చీకటైపోతుంది, లలిత కెవ్వున కేక వేస్తుంది.)

సుధా—అదేమిటీ! ఏవరో Lights off చేశారు ?
రఘు—కొట్టు కుంటున్నారు లోపల!

డాక్టర్—బాబ్బా! అంతా చీకటి!

(గబ గబా ఇద్దరు పరుగెత్తినట్లు అడుగుల చప్పుడు సుందర్రామయ్య కంఠస్వరం "పట్టుకోండి పట్టుకోండి")

సుఖ—బాబోయ్! బాబోయ్! బాబోయ్! బాబోయ్!

రఘు—ఎవరో ఇటు పరుగెత్తారు

డాక్టర్—ఇటుగాదు - అటుగా.

సుంద—పట్టుకోండి! పట్టుకోండి!

సుధా—ముందు Lights వెలిగించాలి. ఆగదిలో Main switch ఉంది.

డాక్టర్—నన్ను వదలండి! నేను డాక్టరును!

రఘు—చీకట్లో ఏం కన్పించటం లేదు!

సుధా—Lights వేసే దాకా ఎక్కడి వాళ్ళక్కడే ఉండండి!

[Lights వెలిగాయి, లలిత అమ్మొయ్యో అంటుంది. సుందర్రామయ్య చేతుల్లో లలిత, మూర్తి చేతుల్లో డాక్టర్ ఉంటారు. రఘు కళ్ళు నలుపుకొంటాడు. సుధాకరం మూడో నెంబరు గదిలోంచి వస్తాడు]

సుంద—ఏమిటిది! అంతా అయోమయంగా ఉంది!

డాక్టర్—అంతవరకూ అర్థమవుతుంది; కాని లోపల ఏం జరిగింది?

లలి—Lights ఆర్పిందెవరూ?

సుంద—ఏం అర్థం కావటంలే! మూర్తిని నేను కేక వేసి కొట్టబోయాం. ఇంతలో ఇటు నుంచి సుఖదేవ్ వచ్చాడు;

అప్పుడే. ఎవడో అటువైపునుంచి గదిలోకి వచ్చి Lights off చేశేశాడు.

లలి—ఎవడో వచ్చాడా?

సుంద—ఎవడో! ముసుగేసుకున్నాడు.

లలి—ముసుగే?

సుంద—వచ్చి మా మీద కలియ పడ్డాడు; నేను గట్టిగా కేక లేశాను.

మూర్తి—నేను వాడి మీద కలియపడ్డా ఎట్లా తప్పించుకున్నాడో - ఆ చీకట్లో! అడుగుల చప్పుడు ఇటేవచ్చింది.

డాక్టర్—ఇటే వచ్చిందీ; చీకట్లో ఎవరో నన్ను ప్రక్కకి తోశేశారు; ఆ అడుగుల చప్పుడు ఇటే వెళ్ళింది.

సుధా—ఇటా! ఆ గదిలో శారద ఉంది! (మూర్తి వంక చూస్తాడు)

మూర్తి—అక్కడికెళ్ళి శారద నేం చేస్తాడో?

సుంద—ఇంతకూ వీడేడీ! సుఖదేవ్.

సుధా—వాణ్ణే ముసుగువాడే లాక్కెళ్ళినట్లున్నాడు! రండీ డాక్టర్! చూసి వద్దాం. (ఇద్దరూ రెండవ గదిలోకి వెళతారు)

సుంద—పదండి! వాడు సుఖదేవ్‌నుకూడా లాక్కెళ్ళాడు ఏం చేస్తాడో - ఏమో!

మూర్తి—ఏం చేస్తాడేమోనని ఆందోళనగా ఉందా?

సుంద—అవును. ఆందోళన కాదూ? వాడూ నా కొడుకు లాంటి వాడేగా?

మూర్తి—మరే! నే న్నీకు శత్రువును గాని- వాడు కొడుకే.
సుంద—అలా అంటావేం ? నువ్వూ నాకు వాడిలాంటివాడవే.
మూర్తి—నువ్వలా అనుకుంటే ఇద్దర్నీ ఒకలాగే చూసే వాడివి. ఆస్తంతా వాడి కిచ్చి, వట్టి చేతులు మాకిచ్చి నేనూ వాడిలాంటి వాణ్ణంటావేం ?
సుంద—అహా ! అయితే నువ్వు నే రాసి పెట్టి ఉంచిన విల్లు చదివావన్న మాట?
మూర్తి—చదివాను.
సుంద—అయితే నేను పక్షపాతం చూపించా నంటావా ?
మూర్తి—నువ్వు చూపించ లేదంటావా ?
సుంద—ఆ! చూపించ లేద నే అంటాను; పక్షపాతం చూపించటానికి బదులు, నిన్నే ఇంకా బాగా చూశానంటాను. మూర్తీ ! నువ్వింకా కుర్రాడివి; తెల్సుకోవల్సింది చాలా ఉంది. మీ అమ్మ లలిత పుట్టిం తర్వాత చనిపోయింది; నేను మళ్ళా పెళ్ళిచేసుకోలేదు; ఏదో నా అవస్థ నేను పడ్తూ మీ ఇద్దర్నీ సాకుతున్నాను మన ఇంటి ప్రక్కనే ఈ సుఖదేవ్ తల్లీ - వాళ్ళూ ఉండేవాళ్ళు. అప్పటికామె నిండు గర్భవతి; గర్భవతి అనికూడా చూడకుండా, నడి రాత్రివేళ నడివీధిలోకి, గెంటేశారు. వేరే గతిలేక ఆమె నా సహాయం కోరింది. నే నొప్పుకున్నాను. కొన్నాళ్ళకు సుఖదేవ్ పుట్టినతర్వాత, - ఆస్తిలో భాగానికి, - దావా వేశాం, గెలిచాం, కాని తిరిగి చూసుకునేటప్పటికి మా

ఇద్దరిమీదా అపవాదులు కమ్ముకు వచ్చాయి. వాదుల్ని భరించలేకేమో_ ఆమె ఈ లోకాన్నే వదిలి వెళ్ళి పోయింది.

రఘు—అయితే-?

సుంద—ఆమె మరణించినా, వాదులు మాయలేదు. సుఖ. దేవ్‌ని నేనే పెంచాల్సివచ్చింది. ఉన్న అపవాదుకూ. ప్రపంచానికీ- భయపడి వాణ్ణి విజయవాడలో ఉంచి ఇన్నాళ్ళూ పెంచాను. వాణ్ణీ పెంచాను, వాడి ఆస్తినీ పెంచాను; నువ్వీనాడు అనుభవిస్తున్న ప్రతిపైసా వాడి ఆస్తిమూలంగా మనకు వచ్చిందే. ఇన్నాళ్ళూ వాడి ఆస్తిని మనం అనుభవిస్తున్నాం.

మూర్తి—అయితే!

సుంద—వాడి ఆస్తిని నేను దొంగతనంగా అనుభవిస్తున్నాను. నా దొంగతనాన్ని పైకి యిన్నాళ్ళూ చెప్పుకోలేక పోయాను. వాడూ పెద్దవాడయ్యాడు. వాడి ఆస్తి వల్ల మనం పెద్దవాళ్ళమయాం - మన పదువూ, పరిస్థితులన్నీ వాడి ఆస్థివల్ల పెరిగి పెద్దవయినవే. నువ్వు గ్రహించే ఉంటావు. మనం వాడికే ఋణపడి ఉన్నాం.

మూర్తి—కానీ! ఎట్లా కావాలో అట్లాగే అవుతుంది; పరాయివాడి ఆస్తీ పాస్తులకు నేనూ ఆశించను - నా పరిస్థితి బాగుంటే.

సుంద—నీ పరిస్థితులంటే? శారదను పెళ్ళాడటమేగా?

మూర్తి—ఆ!
సుంద—అయితే బాధపడనక్కరలే!
(లోపల Revolver పేల్చిన శబ్దాలు విన్పిస్తాయి.)
లలి—అదేమిటీ తుపాకీమ్రోత?
సుంద—అరే, భగవంతుడా! సుఖదేవ్ అక్కడే ఉన్నాడు.
మూర్తి—ఆ శారదకూడా!
రఘు—లోపలికెళ్ళి సహాయం చేద్దామా?
లలి—అహా వద్దు! ప్రమాదంకదూ!
[సుఖదేవ్ పరుగెత్తుకొస్తాడు]
సుఖ—వాళ్ళు దెబ్బలాడుకుంటున్నారు! ఆ వెధవా, సుధాకరంగాయిూనూ, రండి; లోపలికి రండి అందరూ.
(సుఖదేవ్ లోపలికి పరుగెత్తుతాడు)
సుంద—నువ్వొళ్ళకు - ఆగు.
మూర్తి—మనము వెళదామా?
సుంద—వద్దు. మంచిదికాదు.
(అందరూ రెండోగది దగ్గరకెళ్ళి ఆందోళన పడతారు మళ్ళా వెనక్కి వస్తారు; డాక్టర్ పరుగెత్తుకొస్తాడు. అందరూ అతని దగ్గరకి వెళతారు)
డాక్టర్—మీరింకా ఇక్కడే ఉన్నాగేం? రండి - తొందరగా లోపల ఖూనీలు జరిగిపోతున్నాయి.
(డాక్టరు లోపలికి వెళతాడు)
మూర్తి—పోదాం - పదండి; అందరం ఒక్కసారిగా మీద పడదాం; రండి, రండందరూ.

రఘు—కాని వాడి దగ్గర తుపాకీ ఉంది.
మూర్తి—ఉంటే వుంది; ఎల్లాగోఅల్లా మీ దపడి లాక్కుందాం పదండి.
(అందరూ ఒక్కసారిగా లోపలకు పరుగెత్తబోయి ఆగారు)
రఘు—ఓ, ఆ గదిలో Li-hts ఆరిపోయాయి.
మూర్తి—దెబ్బలాడుతున్నారు, చీకట్లోనే దెబ్బలాడుతున్నారు.
సుంద—అరి భగవంతుడా! నాగుండెలు జారిపోతున్నాయి!
[సుధాకరం ప్రవేశిస్తాడు]
సుధా—ఎంత మొత్తుకున్నా ఎవ్వరూ రారేం? మీ కోసం మా ప్రాణాలొడులుకోవాలా! రండి; రండి; వాడూ డాక్టర్, పోట్లాడుతున్నారు.
[లోపలికి వెళతాడు - లోపల అయిదారు సార్లు తుపాకీ శబ్దాలు విన్పిస్తాయి; కుర్రాడు కెవ్వున కేక వేస్తాడు]
లలిత—బాబోయ్ ఖూనీ! ఎంతపుంది చావాలో!
(అందరూ వణుకుతూ రెండవగది దగ్గర కెళ్తారు)
రఘు—అమ్మయ్య! గదిలో Lights వెలిగాయి.
(అందరూ తేలిగ్గా ఊపిరి పీలుస్తారు లోపల గోల తగ్గింది.)
లలి—అదిగో! వాళ్ళు వస్తున్నారు.
[డాక్టరు, సుధాకరం, సుఖదేవు, మరో కొత్తమనిషీ వస్తారు]
సుధా—వెధవ! చావబాదేశాం, తప్పించుకు పారిపోయాడు.
డాక్టర్—(ఆయాసపడ్తూ) మీరు క్షమించాలి; కాని ఎప్పుడూ ఇలాంటి స్నేహితుల్ని నమ్మకండి; అనవసరంగా మన ప్రాణాలు పొయ్యేవి.

సుఖ—రివాల్వర్ ఉంది - ఆ దొంగ దగ్గర.

లలి—ఇంతకూ - ఆ ముసుగువాడేడీ?

డాక్టర్—పారిపోయాడు. డ్రైవరు రాగానే - వాడు పారి పోయాడు

రఘు—(కొత్తమనిషిని చూపుతూ) ఇతను శారదా వాళ్ళ డ్రైవరూ కాదూ?

మూర్తి—నువ్వెప్పుడొచ్చావోయ్-లోపలికి?

సుధా—ఇప్పుడే - ఆ వెనకవైపునుంచి వచ్చాడు.

సుఖ—ఆ! అతను రాకపోతే సహాంమంది చచ్చేవాళ్ళం. ఆ దొంగవెధవ, సుధాకరంగార్ని పేల్చెయ్యబోతుంటే - ఇతను వచ్చేశాడు, వచ్చి - బలే గమ్మత్తుగా లాగేశాడు తుపాకీ; ఏదీ ఆతుపాకీ! ఎక్కడపెట్టావ్?

డ్రైవర్—ఇదిగో. (అని జేబులోంచి రివాల్వర్ తీస్తుండగా ముసుగుగుడ్డ కింద పడ్తుంది.)

మూర్తి—ఇదేమిటి? (తీసి చూస్తాడు)

రఘు—కళ్ళకు కప్పే ముసుగు!

సుంద—ఇదేమిటీ?

(ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటారు-అర్థంచేసుకుంటారు)

సుంద—(డ్రైవర్ దగ్గరకెళ్ళి చెయ్యిపట్టుకుని) అయితే నువ్వన్నమాట నువ్వేనా!

డ్రైవర్—(నవ్వుతాడు)

సుంద—నీతో నేనా - మేం దెబ్బలాడింది?

రఘు—అయితే ఈనాటకమంతా ముందే రాసిపెట్టుకున్నట్టా?

సుధా——వ్రాసుకోవడమెందుకు? వ్రాసుకోనూ అక్కర్లేదు — ఆలోచించనూ అక్కర్లేదు; నాటకాలు వ్రాసినట్లే ఇది కూడా. మనం పాత్రల్ని అర్థంచేసుకుని ఒక సన్నివేశం కూర్చి వొదిలిపెడితే చాలు; వాళ్ళపాత్రను వాళ్ళే నిర్వహిస్తారు; నాటకరంగ స్థలంమీదా, జగన్నాటకరంగ స్థలంమీదాకూడా అంతే! ఇక ఇప్పుడు ఈనాటకం పూర్తి చెయ్యటానికీ (సుందర్రామయ్యగారితో) సుందర్రామయ్యగారూ! మీరు మూర్తితో మాట్లాడుదామనుకున్నారుగాదూ,

సుంద——ఆ! ఆ! మాట్లాడాను. ఆస్తంతా సుఖదేవ్‌కిస్తానని చెప్పాను. ఇంతవరకూ, చేసిన తప్పు ఇకనన్నా దిద్దుకుంటానని చెప్పాను.

మూర్తి——దిద్దుకోవద్దంటంలేదు; శారదసంగతి అలా ఉండకపోతే నాకు నీడబ్బులో దమ్మిడీకూడా అక్కరలేదు.

సుంద——దమ్మిడీ అక్కర్లేకుండానే, శారద నిన్ను చేసుకోటానికి సిద్ధంగాఉంది. సుధాకరంగారు, శారదనూ, శారద తల్లిదండ్రులను ఒప్పించారు. ఇప్పుడు పరిస్థితులు మారాయి,

సుధా——పరిస్థితు లిప్పుడు మారలేదు; ప్రొద్దున్నే మారాయి.

మూర్తి——మారాయి సరే! కాని ఎలా మారాయా అని?

సుధా——తేలిగ్గానే మారాయి; మీరు మీ మనస్సుల్లో తెరలో తెరలులేకుండా ఉన్నదున్నట్లు చెప్పేసిఉంటే, ఇంకా తేలిగ్గానే మారిపోయేవి.

మూర్తి—పోనివ్వండి; ఎల్లాగైతేనేం మార్చారు. అందుకు నా కృతజ్ఞత.

సుంద—ఇంతవరకూ ఇలా బాగానే నడిచింది.

సుధా—ఇక లలితసంగతి......(లలితవంక చూస్తాడు)

లలి—మాసంగతి మేం చూసుకుంటాంలెండి! మమ్మల్ని మళ్ళీ ఒకనాటకం ఆడించకండి.

డాక్టర్—అల్లా ఈ నాటకం ఆఖరి రంగం చివరిదాకా వచ్చింది.

సుధా—ఇంకారాలేదు; సుఖదేవ్! ఇక నీవంతు వచ్చింది. మీ బాబాయ్‌తో మాట్లాడొద్దూ నువ్వూ...

సుఖ—కాని మీరుచెప్పిన పాఠం అంతా మర్చిపోయాను. నా మనస్సుకు వచ్చినట్లే మాట్లాడతాను. ఇంతవరకూ తల్లీ తండ్రీ మొహం ఎరక్కుండా ఎక్కడో పరాయి పంచల్లో పడుండి బ్రతికాను. పెద్దవాణ్ణయ్యాను. ఇన్నాళ్లూ ఒక్క ఆశమాత్రం ఉంది. దూరాన ఎక్కడో "నాఅన్న వాళ్ళు" ఉన్నారని. ఇప్పుడదీ పోయింది. "నావాళ్ళూ" అని నేననుకున్నవాళ్ళే, నన్ను విడనాడిపోతున్నారు. నా పినతండ్రిగా, అన్నగా, అక్కగా, ఇన్నాళ్ళూ నేనెవరినైతే ఊహించుకొని ఆశపడున్నానో, వాళ్ళే నన్నీవేళ వద్దు పొమ్మంటున్నారు. ఈచీకటి లోకపు అడవి దారుల వెంటఒంటరిగా కాళ్ళీడుచుకుంటూ నడవాలి;నాకేం సుఖం ఈ ఒంటరి-ప్రయాణం? నాకేం సుఖం? నాకేం సంతృప్తి, ఈనిలువెత్తు ధనం! మీపాదాలమీదపడి బ్రతిమాల్తాను; ప్రార్థిస్తాను: ఈ ఆస్తిపాస్తులన్నీ మీరే తీసుకోండి; నన్నీ

ఇంట్లోంచి తరిమెయ్యకండి; పనికిరాని వస్తువులాగా నడి వీధిలో నన్ను పారెయ్యకండి – మీపాదాన్ని కనిపెట్టు కుంటాను. నన్ను మీపంచనే ఉంచుకోండి.

సుంద—సుఖదేవ్! (కుర్రాణ్ణి దగ్గరకు తీసుకుంటాడు.)

(సుధాకరం రఘూను కనిపెడ్తుంటాడు)

సుధా—నువ్వేమన్నా మాట్లాడతావా రఘూ? ఏవో మాటలు నీ పెదవులమీద ఆడుతున్నాయి?

రఘు—అహ! ఏం లేదు. మా పెళ్ళి స్థిరమైంది. లలితా! ఎప్పుడు ముహూర్తం?

మూర్తి—మళ్ళీ వేరే ముహూర్త మెందుకూ? మా పెళ్ళి రానే వస్తుందిగా! ఆముహుర్తానికే కానిద్దాం.

సుధా—ఆ...ఆ...ఖర్చులుకూడా కలిసొస్తాయి; మరి ఈ రెండు పెళ్ళిళ్ళ ముహుర్తాలు నే పెట్టనా?

లలి—వద్దులెండి; మా పెళ్ళి ముహూర్తం మేమే పెట్టు కుంటాం.

డాక్టర్—కనక – పెళ్ళిళ్ళు నిశ్చయమైపోయాయన్నమాట. ఇక భాగాలు పంచుకోవటమే మిగిలింది! అయితే ఇంతకూ రెండు భాగాలా? మూడు భాగాలా?

సుఖ—రెండు భాగాలే; నాకు భాగం అక్కర్లేదుగా?

సుంద—అదేమన్న మాట?

సుధా—నన్ను క్షమించండి– డాక్టర్! మళ్ళీ నేను కల్పించు కోవల్సి వచ్చింది; నామాట మీకు నచ్చితే మనో మాట చెప్తాను. అసలు భాగాలు పంచుకోవటమెందుకూ? అందరూ కలిసే అనుభవించరాదూ?

రఘు—ఆ! ఆ! అది చాలా బాగుంటుంది.

మూర్తి—ఆ! ప్రస్తుతం అది బాగానే ఉంటుంది.

సుంద—పోనీ ఆలాగే చేద్దాం. ప్రపంచంలో అంతా ఇల్లా నడిస్తే ఎంత బాగుంటుంది. సుధాకరంగారూ! మీమాట నిలబెట్టుకున్నందుకు నా అభినందనాలు.

మూర్తి—నా అభినందనాలు కూడాను. అభినందించటంతో అయిపోదనుకోకండి; కాని అంతకంటె ఏం చెయ్యగలం? శారద ఇంతసేపూ ఒంటిరిగానే ఉండిపోయింది. మాట్లాడి వస్తా; వస్తావా డ్రైవర్?

డ్రైవర్—ఆ. (ఇద్దరూ లోపలికి వెళతారు)

రఘు—మాట లలితా!

లలి—ఏమిటీ?

రఘు—ఇట్లారా! (ఇద్దరూ నాలుగో నెంబరు గదిలోకి వెళతారు)

డాక్టర్—మొత్తానికి నే ననుకున్న దానికంటే సుఖాంతమైందీ నాటకం!

సుధా—సుఖాంతమవుతుందని నే ముందే చెప్పాగా?

సుఖ—నాటకం అయిపోయిందా? అయితే ఇక Lights ఆరాలి. తెర ఆగాలి. (లోపలికి పోయి Lights off చేస్తాడు. అందరూ నవ్వుతుండగా తెర [illegible]ంగు [illegible]



డా॥ కొర్రపాటి గంగాధరరావుగారు L. I. M.

జననం 10—5—1922. జన్మస్థలం మచిలీపట్టణం. విద్యాభ్యాసం ఏలూరు, మద్రాసులలో. బాపట్లలో వైద్యవృత్తిలో స్థిరనివాసం. తల్లి కీ. శే. లక్ష్మీనరసమ్మ. తండ్రి వేంకట కిష్టయ్యగారు.

చిన్నప్పటినుంచి నాటకాలలో సరదా. నాల్గవఫారం చదువుతుండగా పద్నాల్గవఏట మొదటిసారి "హతవిధి" అనే నాటకం రచించి తయారుచేసి స్టేజిమీద ఆడేరు. ఇప్పటికీ నాటకాలు వ్రాయటం వేయడంకొరకే. అభిమాన రచయిత "ఇబ్సన్"—'ఇప్పటివరకు నేను సాధించగలిగినది, తేలికగా ప్రదర్శించడానికి నాటకాలు వ్రాయడమే' అని వీరంటారు. చాలా నాటకాలు, నాటికలు వ్రాశారు. ఇంకా వ్రాస్తూన్నారు.